# శ్రీకృష్ణ పరమాత్మ.



"మురళీగాన మరంద బిందుకృత సమ్మోద భ్రమద్వల్లవీ
సరసాపాంగ తరంగ భృంగపటలీ సంగ్రామరంగస్థలీ
సరణిం జెల్వగు నీముఖాంబుజమునం జంచన్మనఃపంకజా
కరమధ్యంబునఁ బాదుకొల్పుటకు నాకాంక్షింతు నెల్లప్పుడున్."



# ప్రేమాంకితము

శ్రీ శ్రీ శ్రీ

కొండాలి ఉమామహేశ్వరరావు

జవర్లపూడి మున్సిఫుగారికి:—

బాల్యసఖా!

విద్యాసక్తంబును, స్వార్థత్యాగ విభాసితంబును, సతతపరోపకార నిరతంబును, పూజ్యపాత్రిజ్య భావ విరాజితంబును, ధనగర్వశూన్యంబును, సంఘసేవా తత్పరంబును, శ్రీ బాలగోపాల కృష్ణ కోమలపూత పాదారవింద సమర్పితంబునునగు నీసద్హృదయమునకే నక్కజపడుచు నీ విశుద్ధవిశ్వప్రేమ రసపరిప్లుత "శ్రీకృష్ణ వేణుగానామృతము" నీకరకమలంబుల సహర్ష స్వాంతముతోడ సమర్పించుకొంటి, స్వీకరింపుము!

మానవాదర్శగ్రంథమండలి,<br>అంగలూరు,<br>ది 5—10—27.

త్వద్బాల్యమిత్రుడు,<br>దుగ్గిరాల బలరామకృష్ణయ్య.



# ప్రభుగానము

౧

ఆ దేవుని దివ్యమురళి మదీయ హృదయాంబుజమునం దొక కఠోరజ్వాల నుదయింపజేసినది. ఆయన మనోజ్ఞమగు దృష్టి నన్నేకాంతవాసిగ నొనర్చినది. నా నేత్రయుగ్మ మా కరుణాసాగరుని భవ్యసందర్శనపిపాసాపీడిత మయి యున్నది. మదీయాంతఃకరణ మా యనాథనాథుని సురుచిరనాద సంగీత శ్రవణమున కెంతయు నౌత్సుక్యమును జెందియున్నది.

౨

అత డనంతాపూర్వమంగళమయుడు! అత డేతెంచు చుండును; సుందర గానంబున నానందరసమును వర్షింపజేయు డును! నా యస్ఫుటితసంగీతము, తారకాసముదాయమందును వీచికాసమూహమందును విలీన మగుచున్నయది. ఆ దయామయుని సుఖప్రదగానము నాలకించి, నా కరుణాక్రందనమును విషాదమును లజ్జాన్వితములగుచున్నవి.

౩

నేను తరంగిణీతటమునం దనేకములగు నా కృపామయుని మృణ్మయమూర్తుల నిర్మాణ మొనరించుచున్నాడను; కాని యా జగన్నాథుని చిత్తానురంజకంబగు మృదుమధుర వినాదము క్రమక్రమంబుగ శ్రవణగోచరమయినంతనే, ఆ ప్రతిమల నెల్ల గూలద్రోసి, యా జ్ఞానమయుని సందర్శనాపేక్షాపరుండనయి భక్తకూటముదిక్కునకు బరువెత్తుచున్నాడను.

౪

ఆహా ! ఏమి యీదివ్యసాక్షాత్కారము ! నేను శ్రీకృష్ణభగవానుని, దపోవనమందు మృదులహాస చంద్రికలు ముఖారవిందమున మూర్తీభవించియుండ, గానముసలుపుచుండ నవలోకింపుచున్నాడను. అతడు సుగంధితసుమనఃకిరీటముధరించి యున్నాడు. గోపికాజనులు ప్రేమ భక్తి భావ పరిపూర్ణ హృదయంబులతోడ నాదేవుని బ్రదక్షిణించుచున్నారు.

౫

ఉన్మత్తచక్షుయుగళితో నేను జాగ్రత్స్వప్నము నుపలక్షింపుచున్నాడను; కాని భగవద్దివ్యదర్శనమున నాకు దనివి తీరకున్నయది. ఆజగద్రక్షకుడు నన్నాశీర్వదింపుచు మృదుమధుర గీతంబున నీచందమున హాయిగ గానముసేయుచున్నాడు:—
"కుమారా! నీవు విశుద్ధప్రేమమయుడవగుము! జీవితావరణమునం దంతర్హితుండగు భగవానుని సేవ సలుపుము; విస్మరింపకుము!!"

—టి. ఎల్. వాస్వాని.

---

# విషయసూచిక





# ప్రథమ వచనము.

---

'శ్రీకృష్ణ' నామధేయమే సుమధురమగు నొకసంగీతము.
అతని సౌందర్య మసదృశము. అతని వేణుసంగీతము నిరుప
మానము మానవప్రపంచమునకు శ్రేష్ఠత్వము నాపాదించు
నట్టి యపూర్వపారిశుద్ధ్య మాజగద్రక్షకునిహృదయమున వెల
యుచుండెను. తదలౌకికంబగు శౌచవిశేషమే గోపికలకెల్లరికి
నాదేవుని హృదయేశ్వరుని గావించి మించినది. ఆతడు జగము
నం దావిర్భవించెను. తనపరమపునీతాలోకంబున బురుషులను,
స్త్రీలను, పశుపక్షులను, వృక్షములను, గుల్మములను, పుష్ప
ములను, నక్షత్రములను బ్రఫుల్లితముల గావించెను. మనదేశ
చరిత్రము యొక్క విపద్గ్రస్తకాలంబున నద్భుతప్రేమ ప్రవా
హమును వెల్లివిరియజేయుచు భగవానుడీయార్యావర్తమునం
దవతరించియుండెను.

ముందుపుటలయందు శ్రీకృష్ణభగవానుని సద్విషయ
ములను పొడిమాటలయందు ముచ్చటించెదము. నే నధికముగా
నుద్బోధించునదంతయు యువకులనిమిత్తమె. మనరాష్ట్రము
నిర్ణీతధ్యేయమును బడయ ముందంజవేయ నభిలషింపదా?
ముందడుగిడుటకుసంసిద్ధముగానేయున్నచో రాష్ట్రము యొక్క
యావనులెల్లరు నైతిహాసికభావప్రేరితులయి, యనశ్వ
రంబగు నతీతకాలముతోడి బాంధవ్యమున కియ్యకొనుట పర

మావశ్యకము. * 1 అపోలోనియసు 2 ప్లోటినసు 3 క్లీమాంటు మొదలగు మహాపురుషులీ భరతఖండము నశేషప్రతిభకుత్పత్తిస్థానమని నొక్కివక్కాణించి యున్నారు. వర్తమానయుగమందు సయితము యూరపు, అమెరికాదేశముల సుప్రసిద్ధ విద్వచ్ఛిరోమణు లనేకులు భారతవర్షము నొకపుణ్యతీర్థముగ భావించి గౌరవింపుచున్నారు. దాని చిరకాలవ్యాపకంబగు చరిత్రమున జీటికిమాటికి మహాపురుషు లసంఖ్యాకులు భారతవర్షమును ధన్యవాదభాజనం బొనరించియున్నారు. ప్రాక్తన భరతఖండముయొక్క మహాపురుషులయందు నలువురివైపునకు విశేషముగా నాధ్యానశకటము పరుగిడుచుండును. నే నానల్వురి మహానుభావుల నవతారచతుష్టయంబుగ భావింపుచున్నాడను. శ్రీరామచంద్రుడు శక్తిస్వరూపుడు, శ్రీకృష్ణుడు ప్రేమమూర్తి, బుద్ధమహావీరులు కరుణాహింసావతారములు. ఇం దావంతయు నసత్యము లేదు.

సత్యము దృష్టాంతసముదాయముచే నిరూపితము కాజాలదు. సత్యము తర్కప్రాబల్యంబున స్థిరీకరింపబడదు. నిస్తబ్ధంబగు నేకాంతమందే యది ఘోషితమగుచు హృదయంగమంబగును. మహాత్ముల శ్రీముఖంబులనుండి వెలువడుచుండు

---

* 1 ఇతడు ఏషియా మైనరునం దొక సుప్రసిద్ధదార్శనిక విద్వాంసుడు. 2 ఈతడు ఈజిప్టుదేశమందలి విఖ్యాతుండగు దార్శనికుడు. 3 ఈయన క్రైస్తవ ధర్మమునం దొకగణుతికెక్కిన యాచార్యుడు. ఈమువ్వురును గీర్తిశేషులె.

నుత్తమవచనంబులవలననే సత్యము ప్రకాశమాన మగుచుండును. మహాత్ములు పద్యములను, కథలను, సరళ భాషణమును-గానమును సత్యదిగ్దర్శనమునకయి స్వీకరింపుచుందురు. క్రీస్తు భగవానుడు ప్రబల ప్రమాణ వాక్యసాహాయ్యంబున సత్య సందేశమును విశ్వమునకు జాటియున్నాడు శ్రీకృష్ణచంద్రుడు మురళీనాదము నుప్పతిలజేసెను. తన్మురళీ బహిర్గతంబగు దివ్యగానమే జీవితనైసర్గికాదర్శప్రబోధమునకు హేతుభూతం బయ్యెను. నేనద్దానినే సమన్వయాభాసము (సమష్టీకరణ ప్రకాశము) యని వచింతును. అందు భ్రాతృభావమును, ఐక్యభావమును బూర్ణత్వమున వెలయుచున్నవి. ఇదియె సుఖమయాభాసము. దుఃఖితప్రపంచమున కిదియె పరమావశ్యకమయి యున్నది. మొన మొన్ననే వెలువడిన యొక రూపకము యొక్క 'పాత్ర' యొక టీరీతి ద్వితీయపాత్రను బృచ్ఛింపుచున్నయది :—"నీవు నల్లనిబట్టల నేల ధరింపుచున్నాడవు?" "ఇది నాజీవితము యొక్క శోకమయసమయము-నేను విషాదగ్రస్తుడను." అని యాద్వితీయ పాత్రధారి యుత్తరమొసంగెను. వర్తమాన కాలమునం దనేక దుఃఖితులు కలరు. వారికి నవ్యజీవిత సంచారకంబును, దివ్యశక్తి ప్రేరేపకంబును నగు సత్యసందేశము పరమావశ్యకము. "స్వీయ స్వత్వ సంరక్షణ నిమిత్తము ఘోరకృషియు, జీవిత యుద్ధంబును ముఖ్యములు. అధికసహన శీలురగు వ్యక్తిసత్త

ములే సజీవులయి మనుచుండ సమర్థులరు.” ఇట్టి శిక్షావిషయం బుల నాధారముగ జేసికొనియే డార్వినుయొక్క యాంశావా దము సమగ్రవిశ్వమును సమరక్షేత్రమునకు సడపనది. అధు నాతన నాగరకత నిర్జీవమయియున్నది. మురళీధరుండగు శ్రీకృ ష్ణభగవానుడు మనకొక్క నూతనజీవిత సందేశము నుపదేశిం పుచున్నాడు:—“మీరెల్లరు సర్వేశ్వర సంతానము, ఆతఁ యాద్వితీయ చరమసౌందర్యమందే మీరుస్థిర నివాసము. మీర లిట్టిస్థితియందేల ప్రేమనుండి దూరులయ్యెదరు? మీ దివ్యవులగు శక్తిసామర్థ్యముల నెందుల కీర్ష్యా, ద్వేష, వివాదములకయి దుర్వినియోగ మొనరించి వ్యర్థులయ్యెదరు?”

శ్రీమద్భగవద్గీతయొక్క సంగీత మీ సుమధురమం త్రములతోడనే నిండి నిబిడీకృతమయి యున్నది. ఇద్దియే సకల హిందూమత గ్రంథసముదాయ సత్సారము. ఈనాకథ నము సత్యేతరము కాదు. “సర్వోపనిషత్తులే ధేనువులు, గోపాలకృష్ణుడే దోగ్ధ, పార్థుడే గోవత్సము, విశుద్ధ బుద్ధిసం పన్నులగు మనుజులే యాదుగ్ధమును గ్రోలువారు, గీతయే యాదివ్యమగు మిష్టక్షీరము.” అని వ్రాయబడియేయున్నదికదా!

శ్లో॥ సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనన్దనః,
పార్థోవత్సః సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్.”

వంశీధరుండగు శ్రీకృష్ణభగవానుడు మనకెల్లరికి నాత్మీ యమగీతయందు సమష్టికరణము యొక్క మధురసంగీతము ను

గానముజేసి యున్నాడు. ఇందే యథార్థమగు జీవిత సంచలన శక్తి యంతర్భూతమయి ఘనీభవించి యున్నది. భగవద్గీత సంసారము నొక్కసారి బహిష్కరించి వేయవలసినదిగా నుప దేశించియున్నదను వాదము సత్యవిరుద్ధమని గ్రహింప ముకు ళితహస్తుండనయి లోకమునకు నివేదించుకొనుచున్నాడను. గీత కేవలము మనల కేవిధంబున దుష్టమగు నహంకారమును బరిత్యజియించి పరిశుద్ధాత్మను గ్రహింపవలయునో, ఏచంద మున మాయావికృతుల జయించి యాధ్యాత్మిక జీవితపథాను సరణంబును బడయవలయునో బోధింపుచున్నయది. శ్రీకృ ష్ణభగవానుని గీత యున్నతజీవిత సందేశ ప్రతిభాసితమయి వెలుంగుచున్నయది. ఉచ్చాదర్శవాదముచే గీత ప్రేరితమయి రాణింపుచున్నయది. హీనంబును నింద్యంబును నగు తర్కవిద్యా కం దీపణాత్మత్రియయిన స్థానములేదు శ్రీకృష్ణ ప్రేమసందేశ ముత్కృష్టకర్మయోగాదర్శగానమాత్రమె.

నేను ప్రాయికంబుగా పాపము కేవల మొక్కటియేయని తలంపుచున్నాడను. ప్రేమవిరుద్ధములగు కర్మలును పృథ గ్భావపాపములె. అధునాతన ప్రపంచము ప్రేమరాహిత్య జాడ్యగ్రస్తమయి యున్నది. వ్యవసాయోద్యమములు చరమ సీమ నలంకరింపుచున్నవి. కాని, అయ్యో! వాని విశేషభాగ మహాంబ్రహ్మత్వముతోడను, మిథ్యావాద వివాదస్వా రంబులతోడను బరిపూర్ణమయి యున్నది. అయ్యవి జీవిత

విభూతిని బాదవిదళిత మొనరింపుచున్నయవి. వర్తమానకాల వ్యవస్థ దీనులపట్ల నిరాదరభావప్రౌఢిమను వహించినది. బోల్షివిజముయొక్క క్రాంతికారిణియగుశక్తి యాత్మావహేలన మొనరించునట్టి యొక నింద్యమగు వ్యవస్థ నుద్భూత మొనరింపుచున్నయది. ట్రాట్స్కి *మహాశయుడు తన "ఇంగ్లాండెటకేగుచున్నది?" యను గ్రంథాంతమున నీచందమున లిఖియించుచున్నాడు:— "బోల్షివిజము (సమత్వవాదము) భౌతికవాదమును, నిరీశ్వరవాదమును భువి నెలకొల్పును." రాష్ట్రసంఘమునిర్వీర్యమయి, నిస్తేజమయియున్నది. లొకార్నో (1924 సం॥) యొక్కసంధి ప్రద్వేశములయెడ బాశ్చాత్యరాష్ట్రముల సామ్రాజ్యసంబంధియములగు నాకాంక్షల దృఢపఱచును. కొలదికాలమునకు దొలుతనే వెలువడిన యొక గ్రంథమునం దొక్కశిక్షాప్రదమగు కథకలదు. క్రోధాంధుడగు నొక సైనికోద్యోగి యుద్రిక్తుడయి యీచందమున నుడువుచున్నాడు:—"ఈ పాశవిక రాష్ట్రసంఘము నాధారముగ జేసికొని విల్సను (రాష్ట్రసంఘస్థాపకుడు, అమెరికా సంయుక్త రాష్ట్రములయొక్క భూతపూర్వాధ్యక్షుడు) యేమి నిరోధింపగలడు? వానిని గాలితో దన్నివేయుడు! నేను మానవ సౌభ్రాతృత్వోన్మత్త ప్రలాపవాక్యముల నాల

---

* ఇతడు రష్యారాజ్య విప్లవోద్యమ నాయకులయం దొక్క విఖ్యాత పురుషుడు.

కింప వాంఛించుటలేదు.'' భ్రాతృత్వమన బంధుత్వమనియే తాత్పర్యము. ఈ యుత్తమ సౌమ్యభావమునే విదీర్ణ మొన రించి పాశ్చాత్య సభ్యత స్వకీయాధఃపతనము వైపునకు దుత్రగతి బరుగిడుచున్నయది. సుప్రసిద్ధచరిత్రజ్ఞానసంపన్నుం డగు హారస్పెంగలరు మహాశయు డీవడువున నుడివియు న్నాడు :—''పశ్చిమభూఖండము విధ్వంసమయి పోవుచున్నది. పాశ్చాత్య నాగరకతాపతనముతోడ్తోడనే క్రైస్తవ ధర్మా భ్యుదయ భాస్కరు డస్తమించును.'' సామ్యవాదమును సమ ర్థించు శాసన మెంతమాత్రమును బశ్చిమమును సంరక్షింప జాలదు. ధార్మికశాస్త్రార్థము క్రైస్తవ ధర్మమును గాపాడ జాలదు. పాశ్చాత్య రాజనీతియొక్క ప్రతిధ్వని మాత్రమగు హింసాత్మకమత మేస్థితియందును భరతఖండమును సముద్ధ రింపజాలదు. సమస్తదేశములును, సకలధర్మములును, నిఖల లోకమును శాంతిమయసందేశమును, సౌభ్రాతృత్వ సందేశ మును, పరిశుద్ధాత్మసందేశమును బడయ నాతురపడుచున్నది.

కరుణాకరుండును, దయామయుండును, ప్రేమైకస్వ రూపుండును నగు మురళీధరు డీదివ్యసందేశమునే ప్రాక్తన కాలమందు విశ్వమునకు జాటియున్నాడు. ఈదివ్యప్రేమ తత్త్వమే పునః నాగరకతోత్థానమున కర్హమయియున్నది. శ్రీ కృష్ణభగవానుని సర్వజనీనములగు దివ్యోపదేశములు కేవ లము భరతఖండమునకేగాదు, సకలదేశములకు గల్యాణ

దాయకంబులును, అపేక్షణీయములును, సత్వరాచరణీయము లునయి తనరారుచున్న వనియే నా దృఢవిశ్వాసము. తద్దేవుని శ్రీచరణసరోజములయం దనేకశతాబ్దములసమ్మేళన మగుచున్నయది. బాలగోపాలకృష్ణుడు ప్రేమసామ్రాజ్యచక్రవర్తి. "ప్రేమయే జీవితము". అను వాక్యరత్నద్యుతికంటె విశ్వమండలమునం దింతపర్యంత మేకాలమందు నధికోజ్జ్వల జ్ఞానప్రకాశము లోచరగోచరమయి యుండలేదు. ఇది ధ్రువమగు సత్యము.

—టి. ఎల్. వాస్వాని.



# శ్రీకృష్ణ వేణుగానామృతము.



## ౧. ఆధ్యాత్మిక సమష్టీకరణము

నేను విశ్వము యొక్క సకలధర్మ బంధుత్వము (విశ్వ సౌభ్రాతృత్వము) నందును సంపూర్ణవిశ్వాసమును గల్గియున్నా డను అవనీమండలము యొక్క సమస్తధర్మములును, మతము లును మానవోద్యానవాటికయందు పుష్పములభాతి వెల యుచున్నవి.

సూర్యానువర్తినీపుష్పములన్నియు (ప్రొద్దుతిరుగుడు పూలు) భాస్కరబింబాభిముఖములయి యే యుండుచున్నవి. ఇదియేచందమున సకలధర్మములును విశుద్ధ ప్రేమయోగము వైపునకే యుండును. అఖిలమతములును, సూర్యుని బ్రకాశ మానునిగజేయ సమర్థుండయిన యా దయామయుండగు పర మేశ్వరునే లక్ష్యముగల్గియుండి తమ యంతర్దృష్టి నతనివైపు నకే ప్రసరింపజేయుచున్నవి. అనాదికాలమునుండియు వైదిక ధర్మ మీభావముచేతనే ప్రేరితమగుచు వచ్చియున్నది. "ఒక్కపరమేశ్వరుని యొక్క నివాసప్రకాశమే యెల్లజీవుల యందును, ఎల్లకాలములందును వెలయుచున్నయది." అను రహస్యమును హిందూధర్మ మెపుడును విశ్వమునకు జాటు చు నేయున్నది.

శ్రీకృష్ణభగవాను నొకయద్భుతుండు హిందూధర్మ ప్రవర్తకుండని వచింపగగును. ఆత డద్భుతసమష్టీకరణ తత్త్వోపదేశమును బ్రపంచమునకు గటాక్షించి యున్నాడు. నేను భగవద్గీతను యావజ్జగత్కావ్య ప్రపంచమం దద్వితీయ కావ్యమని వచింప సాహసింపుచున్నాడను. భగవద్గీతకర్తయగు శ్రీకృష్ణచంద్రునివలన మనకు సులభముగా గరతలామలకంబగు నంయోగాత్మక శుద్ధబుద్ధిని షేక్స్పియరుకవిశేఖరునుండి పడయ నభిలషించుట వ్యర్థమేయగును.

పరిశుద్ధ హిందూధర్మాదర్శ హృదయాభ్యంతరిక ప్రదేశమును సమీపించ వాంఛించువారు గీతోపదేశ జీవితస్వాభావిక గంభీరసమన్వయమును గుర్తెఱుంగవలసియుండును. విమర్శకుల దృష్టియందు హిందూమతము కేవల మనేకమతముల యొక్క వనము; కాని వారీవిశాలోద్యానమందు నయితము క్రమము, గ్రంథనమును గలవను మర్మమును గ్రహింపజాలక పోవుచున్నారు. కారణమేమనగా హిందూధర్మము మతము చే శాసింపబడినది కాదు. విమర్శకు లద్దాని నవ్యవస్థితమనియు, సకలమును గ్రహించునదనియు దూషింపుచున్నారు. వాస్తవమిది కాదు. అనంతాత్మయాత్మ యొక్క సర్వవ్యాపకంబగు రూపమును బ్రదర్శించు సమష్టీకరణమే హిందూమతాదర్శము. పాశ్చాత్యబుద్ధియును, అనేకేశ్వర పూజాపరతంత్రంబును నగు ధర్మమునుండి హిందూధర్మము భిన్నమయినదియె. కేవలము

హిందూధర్మ మాధ్యాత్మిక సమష్టీకరణము లేక యేకీకరణము. శ్రీకృష్ణభగవానుడు సంధినిమిత్తమును, నిర్మాణార్థమును భువినవతరించెను. గాని విధ్వంసనార్థము కాదు. అతడు మనకొక సుస్థిరసమన్వయ తత్త్వోపదేశమును దయాంతరంగితమతియయి ప్రసాదించియున్నాడు. హిందూధర్మ సాగరమునం దనేక ధర్మవిచార ప్రవాహములు సమ్మిళితములయినవి. ఇది సకలధర్మ సిద్ధాంతములకు సంగమస్థానము. దీనిపైన యూదులయొక్కయు, పార్శీకులయొక్కయు క్రైస్తవ మహమ్మదీయులయొక్కయు ధర్మప్రభావము వ్యాపించియేయున్నది. ప్రస్తుతకాలమునం దా పురాతనధర్మమందు విజ్ఞానప్రకాశము ప్రసరింపుచున్నయది. మనమెప్పటినుండియో విస్మృతవిశ్వప్రపంచమునం దధివసింప నభ్యస్తులమయి యున్నారము. హిందూధర్మమం దనేక పరివర్తనములు తటస్థించియున్నను సమగ్రధర్మము సనాతనముగనే యున్నది. అద్దానిగతియు నవిరామమయినదియె. ఏత దనుపమనిత్యత్వమునకు మూలకారణము శ్రీకృష్ణభగవాను డుపదేశించియున్న సమష్టీకరణమె. యథార్థ మారయ భగవద్గీత సమష్టీకరణము నుద్బోధించు గ్రంథరాజమె. శ్రీకృష్ణచంద్రునికి హిందూధర్మముతోడ నెట్టిసంబంధముకలదో, ఆదేవుని ప్రేమసందేశమునకును నతనిమురళికిని నట్టి బాంధవ్యమే కలదనుట రూఢియని నేను విశ్వసింపుచున్నాడను. నైసర్గిక జీవితాత్యంతగంభీర సమన్వయంబగు

ప్రేమభావప్రతిమయే శ్రీకృష్ణచంద్రుని వేణువు. గోపాలకృష్ణుని పిల్లనగ్రోవి మూర్తీభవించిన విశుద్ధవిశ్వప్రేమయేసుడీ!

ప్రత్యేకధర్మ మాత్మీయ ప్రతిభావిశేషమును ప్రతి రూపంబున ప్రకటింపుచుండును. క్రైస్తవధర్మ చిహ్నము సిలువ. ఈచిహ్నమే యొకింత పరివర్తనమునుజెంది త్రిశూల ధారియగు శివునియందును, వజ్రదేవియగు నదూయందును, అరబ్బీలదేవియగు లాటునందును గానగుచున్నయది. ఈ శోఙ్ఞ మహోత్తరంబగు నాత్మబలిదాననియమంబును, ఆవి ర్భావము యొక్క దివ్యతత్త్వమును బోధింపుచున్నయది. జర థోస్తమహాశయుని (ఇతడు పార్శీకధర్మ ప్రవర్తకుడు. జన్మ క్రీస్తుశకమునకు 550 సం॥ పూర్వము) ధర్మము యొక్క గురుతు అగ్ని. ఇదియే పరివర్తిత రూపంబున నరబ్బీల యహోవాదేవి యొక్క యగ్నిత్రిశూలమునందు గానవచ్చు చున్నయది. ఈచిహ్నమువలన బారిశుద్ధ్యముయొక్క బోధ మనలకు లభ్యమగుచున్నయది. జరథోస్తమహాశయుని ప్రచం డానలము మన సకలపాపపుంజముల భస్మీభూత మొనరించి మనల బరిశుద్ధులగావించుశుద్ధాత్మజ్వాలయేయని గ్రహింపుడి.

స్మృతులయొక్కయు, దర్శనములయొక్కయు, నియ మముల యొక్కయు, సిద్ధుల యొక్కయు, సాధువులయొ క్కయు సమావేశమే మురళియొక్క సమష్టీకరణ ప్రతిమ.

మహానుభావులు విశేషముగా దృష్టాంతములను, చిత్రములను, సూత్రములను, గీతములను నాధారము జేసికొనియే విశ్వమున కుపదేశింపుచుందురు. గీతయొక్క స్థానము మౌనమునకు బిదప ద్వితీయము. ప్రకృతియొక్క యనాది సిద్ధమగు స్వరము మానవుని వాణికంటె నధికపురాతనమయినది. ప్రకృతి పుష్పములను, నక్షత్రమాలను, తరంగమాలికను నాధారము జేసికొని విశ్వప్రబోధ కార్యమున బ్రవేశింపుచుండును. శ్రీకృష్ణభగవానుడు మధురసంగీతముద్వారా లోకమునకు శిక్షనొసంగియున్నాడు. ఆహా! మనము సంగీతమువలన నపారమగువిద్య నభ్యసింపగల్గుచున్నారముకదా! దివ్యగానము నాలకించినంతనే మన నేత్రములనుండి ప్రేమాశ్రువులు ధారారూపమున బ్రవహింప నారంభించుచున్నవి. హృదయాంబుజము వికసింపుచున్నయది. శ్రీకృష్ణభగవానుడు తనవెంట వేణువుయొక్క సుందరాద్భుత మధురసంగీతమును గొనివచ్చియున్నాడు. స్వరసంయోగము లేనిదే సంగీత మసంభవమే యగును. శ్రీకృష్ణచంద్రుడు మురళీగానముద్వారా సమున్నత జీవితోదారసమన్వయమును విశ్వమునకు బాగుగా బ్రదర్శించి యున్నాడు!



## ౨. మురళియొక్క యాహ్వానము

శ్రీకృష్ణభగవానుడు తన దివ్యమురళిని ధ్వనింపజేసినాడు తదాగతంబగు గానము భావముయొక్క యద్భుత

ప్రేమరసప్రవాహ కేంద్రస్థానము! తదీశ్వరుని క్రీడలు ప్రేమలీలలు. ప్రకృతి, ప్రేమపరిభావముచే ప్రఫుల్లిత హృదయ కాదందురా? శ్రీకృష్ణుని గానమునం దాధ్యాత్మికాకర్షణ శక్తి యపరిమితమయి యున్నది. ప్రేమమయుండును, సుందరస్వరూపుండు నగు నా కృష్ణమూర్తి కోమలపాణి తలంబున మురళింబట్టి మృదులాధరంబుపై నానిచి మనోజ్ఞముగ గానము సేయునప్పుడు పాదపపంక్తులు ప్రేమపరిభావముచే గంపించినట్లును, పుష్పసముదాయములు నవీనవిశుద్ధ సౌందర్యచ్ఛటలచే వికాసభాసురంబు లయినట్లును, మందమారుతమును, విహంగతతులును ప్రేమభావ రసతరంగ డోలికల నూగుచు గలరవంబుల నుప్పతిల జేసినట్లును మన మెన్నియో ప్రాచీనోత్తమ గ్రంథరాజముల బఠించియున్నారము.

ప్రభుగానము వైపునకు బ్రాచీనకాలమునం దెల్లరు నిజధ్యానమును బ్రసరింపజేసియుండలేదు. ధనముయొక్కయు క్షమయొక్కయు నభిమానముచే బరిపూర్ణచిత్తులయిన వారలెవరు నాగానముచే నాహ్లాదచేతస్కులయి యుండలేదు. ఆదివ్యమధుర సుందర గానామృతవృష్టిచే దీనులు, దరిద్రులు, కృషికారులు, గోపికలు ముగ్ధహృదయులయి యుండిరి. విషాదవ్యాకుల చిత్తులు, సరళస్వభావులు, యథార్థజ్ఞానసంపన్నులు నగువారెల్లరు మురళీమంత్రధ్వానము నాలకించియుండిరి. ఆసంగీత మతిసరళమయినది. సారళ్యమే వాస్తవమరయ నతిప్రశస్తమయి

నది. అసంఖ్యాకలగు లలనాశిరోమణుల పరిశుద్ధంబులును, నిర్మలంబులును నగు హృదయంబుల మనోహర మురళీగాన మాత్మ జ్ఞానాభిలాషను జాగరిత మొనరించెను. పురాతనకథలు మురళీధరసందర్శనాపేక్షచే క్షేత్రములందును, వననికుంజములందును, జనపథములందును దర్శనపిపాసావ్యధితంబులగు నయనంబులతోడ దిరుగుచుండినటుల మనకు విశదపఱచుచున్నయవి. ఆ పవిత్రస్మృతియే యనేక శతాబ్దములనుండి శబ్దాయమానమును శ్రవణగోచరము నగుచున్నయది; పంచ సహస్ర వత్సరములకు బూర్వమే ప్రభుసత్తముని చరణకమల రజ మీయార్యావర్తమును బునీతము గావించి మించెనో, ఆ శ్యామసుందరుని మనోహర యశోగుణ గాన మిప్పటికిని గ్రామగ్రామముల ప్రతినికేతనమున- నిఖిలభారతీయ హృదయంబుల బ్రతిధ్వనితమగుచునే యున్నది. ఈశ్వర ప్రేమయు నానందమును బ్రకృతియందు సమ్మిశ్రితములయి ప్రతిదివసము సుందరరూపంబున-పత్రములు, ముకుళములు, కుసుమములు, మొదలగువాని యాకృతియందు మనకు గానుపించుచున్నవి. శ్రీకృష్ణచంద్రుని మురళియందు పరబ్రహ్మయగు పరమాత్ముని చరమప్రేమయు బరమానందమును మూర్తీభవించియున్నవి. ఆదివ్యవేణుస్మృతి భారతవర్షము యొక్క యౌవన కాలస్మరణము నెల్లరి కొదవజేయుచున్నయది. ఆపురాతన సమయమున భరతమాత తరుణవయస్కయు, శక్తిసం

పన్నయు, బరమ రూపలావణ్యవతియు నయి సర్వాంగ సౌష్ఠ
వంబున వెలయుచుండెను. కాని, అయ్యో! వర్తమాన భరత
ఖండమున ననుకరణబుద్ధి పుష్కలముగా వ్యాపించి దేశపత
నమునకు హేతుభూత మగుచున్నయది. శ్రీకృష్ణభగవాను
నారాధించినవా రెల్లరు మురళియందు నవయౌవన స్త్రీమతిని
గనుగొనియుండిరి. అదియే వారెల్లరికి సంసారజాడ్య నివృ
త్తికి సుధాసమాన మయ్యెను.

మురళియొక్క ప్రేమమయ దివ్యసందేశముచే భార
తీయ కవిత్వము, కళాకుశలత్వము, అధ్యాత్మజ్ఞానము వికాస
చరమసీమ నధిష్ఠించినవి. భాగవతోత్తములగు సూరదాసు,
మీరాభాయి, విద్యాపతి, చండీదాసు మొదలుగాగల వారె
ల్లరు నెట్టి మనోహర సుస్నిగ్ధ భక్తిద్యుతి ప్రదీప్తంబులగు
శబ్దంబుల శ్రీభగవానుని సద్గుణగణ గానము గావించియు
న్నారు! మీరాభాయి రాడ్వంశసంభూత, భూపాలపత్ని;
కాని సకలైశ్వర్య భోగంబుల దృణప్రాయంబుగ విసర్జించి
శ్రీకృష్ణ చరణ పరిచారిక యయినది. సమస్తవ్యథలను దైవ
ప్రసాదముగ మది భావించి సహర్షస్వాంతముతోడ ననుభ
వించియుండెను. ఆమె స్వీయారాధ్య దైవప్రేమాభిలాషమ్ము
నిఖిలదుఃఖపరంపరల గాఢాలింగన మొనర్చుకొనినది. ధీరవీర
హృదయాంబుజముతోడ సకలమును బ్రేమమయంబుగ
నెంచి ధన్యభాజన మొనరించినది. చక్షుసరోజయుగళి ప్రేమా

శ్రుకణపరిప్లుతమగుచుండ జీటికి మాటికి నా దేవీలల్లామ శ్రీముఖమునుండి మృదుమధురంబగు నీగీతఖండమే యస్పష్టముగా వినవగుచుండెడిది:—“గిరిధరుండగు నాగోకుల బృందావన బాలకృష్ణమూర్తియే నాకు దిక్కు, మరెవరును గాదు.”

ఇంక సూరదాసన్నచో శ్రీకృష్ణుని జ్వలంత ప్రభావిశేషంబున బూర్ణాంధుడే యయినాడు. అతడు చర్మచక్షువిహీనుండును, పార్థివదృశ్యాదృశ్యుండును నయి యుండినను దివ్యాధ్యాత్మిక దృష్టిసంపన్నుడె త్వగక్షువులబహిష్కరించివైచినను సూరదాసు, భక్తశిరోమణియగు సూరదాసు, నిస్తులాప్రమేయ ప్రేమప్రభావుండగు సూరదాసు మురళీధరుని రసమయ ప్రేమాంబుధినిమగ్నుడే యయియుండెను. దివ్యప్రభువగు శ్రీకృష్ణచంద్రుని వియోగబాధితంబగు సూరదాసుని పరిశుద్ధాత్మ నివేదనరూపంబులగు గీతంబు లెంతమనోహరములు! సర్వజనానురంజకములు !! అనూనాసమాన రసమయములు !!!

“దివారాత్రములు నా నేత్రయుగళి ప్రేమాశ్రువృష్టిని వర్షించుచున్నయది. శ్యామసుందరు డిటకేతెంచిన దాది వర్షఋతువు సర్వదా నిజప్రభావమును బ్రదర్శించుచున్నయది. నిశావాసరములు నయనములందలి కజ్జలము, కన్నీటిధారలగలిసి హస్తతలములను, కపోలములను నసితవర్ణవిరాజితములుగ జేసి వైచుచున్నయది. హృదయాంతరాళమున బ్రేమాంబుప్రవాహము తరం

గీతముతోఁ బొంగిపొరలుచు ధరించిన బురకానంతయు జలసిక్తమొనరించి వేయుచున్నయది. కాయమంతయు బ్రేమజలమునుంబడుచున్నయది. ఎన్నివిధములఁ హారము జేసి చూచినను గడియకాలమయినఁగడచుట దుర్లభంబు గానున్నది! ఓదీనసంరక్షకా! ఆర్తత్రాణపరాయణా! గోపాలకృష్ణమూర్తీ! జాగేల? రావేల! నీపాదకింకరుం డగు నీసూరదాసు భవద్వియోగ దుఃఖవారిధిం బడి గోకులబృందావన సమేతముగా గొట్టుకొని పోవుచు న్నాడు! రా! రమ్మా!! నీ చరణారవిందభక్తిగతప్రా ణుండనగు నామొర బిరానఁనాలకించి కనికరింపుము!!

ఆధునికత (ఈతర్కము సహేతుక మయినదియె) కేవలము గానము లేక భావమునే కృష్ణభక్తుల యపరోక్షజ్ఞానాను భవమూల్యమును గ్రహింప వాస్తవికంబగు సాధనంబుగ భావింపరాదనియె వక్కాణింపుచున్నయది. వ్యావహారిక రూపంబుచే నద్దానిని మీరు పరీక్షించుకొనని వేదింపుచున్నా డను. అద్దానిసాఫల్యముచే మీరలు యథేష్టప్రమాణముల బడయ శక్తిమంతు లయ్యెదరు. భక్తుల యనుభవ పరిశీలన మును దానిపరిణామముచే సయితము సేయవచ్చును. వంగీ యులనొకింత విలోకింపుడి! శ్రీకృష్ణభక్తి, సుప్రసిద్ధవిద్వాం సుడును, తర్కశాస్త్రనిష్ణాతయునగు గౌరాంగుని (చైతన్య మహాప్రభువు) జీవితమునకు నూతనరూపంబును బ్రసాదించి

యుండెను. శ్రీకృష్ణభక్తివిశేషంబునసే వంగరాష్ట్రమునం దొక నవీనంబగు సంస్కృతి (శ్రీష్ఠత్వము) యావిర్భూతమయినది. అసంఖ్యాకులగు హైందవ భారతల ధార్మికజీవితములయందు శ్రీకృష్ణభక్తి యసీమంబగు చైతన్యము నొదవజేసినది. అనేకులగు యవనమతావలంబులు సయితమద్దానికి వశీభూతులయిరి. శ్రీకృష్ణభగవానుని మహాత్మ్యదీయ భక్తుండొక్కరు డిప్పగిది గానము సలిపియున్నాడు :—"నేను వంశీనినాదము నాకర్ణించినంతనే నానయనంబులు ప్రేమాంబు పరిప్లుతము లగుచుండును—కపోలములు జలాభిషిక్తము లగుచుండును. శ్రీకృష్ణ భగవత్సందర్శనమును నేను బడయజాలక పోయితినేని హతభాగ్యుండను, వ్యర్థజన్ముండనే యగుదును. కృష్ణసందర్శనమునకు నోచేని నేను జీవచ్ఛవంబనె."

శ్రీరాధాకృష్ణ సంబంధీయములగు ననేకోత్తమ భక్తిరస ప్రధాన మనోహరగీతంబుల నొక యువనకవిరాట్ఛిరోమణి విరచించియున్నాడు. ఈభక్తకవీంద్రుడు తన్నొక చైతన్యప్రభు పరిచారకునిగ జెప్పుకొనుచుండెడివాడు. మురళీమహాత్వ ప్రచారమునం దీచైతన్యస్వామి యసీమాదమోత్సాహమును బ్రకటించియున్నాడు. దబీరుఖానుండును, మలిక్ సాహేబును హిందూధర్మమును బహిష్కరించి ఇస్లాము ధర్మమును బరిగ్రహించియుండిరి. పార్శీక సంస్కృత సాహిత్యములయందీ యిరువురికి యథేష్టపరిజ్ఞానసంపత్తి యుండెను. సయ్యదు పక

రుద్దీనుసాహేబునుండి వీరుభయులు నరబ్బీభాష నభ్యసించి యుండిరి. శ్రీచైతన్యస్వామి వీరి నుభయులను దివ్యప్రేమ మయజీవిత సందేశోపదేశంబుల హిందూసంఘమునందు జేర్చి కొనియెను. వైష్ణవధర్మమునం దవ్వారిని దీక్షితులుగజేసి చైతన్యస్వామివారి పురాతన హిందూనామంబులగు "సనాతనుడు, రూపకుడు" అనువానిని వారలకొసంగెను. ఈ సనాతనుడే శ్రీకృష్ణభక్త ప్రపంచమునం దగ్రస్థానమును వహించెను. శేరఖాననువానిని చైతన్యపంథానుయాయులు హిందూధర్మ దీక్షాబద్ధు నొనరించియుండిరి. అనేకులగు పాషండ మతావలంబకుల—హిందూమత మస్పృశ్యులుగ భావించి యుండియు శ్రీకృష్ణభక్తికారణంబున వారినెల్లర నుత్తమ హిందూసంఘమున సమ్మేళనము జేసికొని యున్నది. ఒక్కసారిగనే 2500 మంది బౌద్ధులు వైష్ణవమతము నవలంబించియున్నట్లు నేను చదివియున్నాడను. రఘునాథదాసు భూపాలనందనుండయ్యు ముగలియొక్క యాహ్వానము నాలకించి గౌతమబుద్ధుని విధంబుననె సకలైశ్వర్యంబుల లోష్టతుల్యముగ త్యజియించివైచెను. భగవానుని దివ్యనామసంకీర్తన ప్రచారము జేయుటయందే యత డనంతమగు సౌఖ్యానందముల ననుభవించెను. నరోత్తముడు నయితము నృపాలనందనుడె. గ్రంథస్థితమగుకథ యితనింగూర్చి యిట్లున్నయది:—"ఒక దివసమున బాల్యసమయమందు ప్రకృతి మృదులహాసము

నేయుచున్నదో యన్నటుల నదీతరంగ మాలికోపరిభాగంబున బుద్బుదఫేనము తళతళ మెఱయుచుండ నరోత్తముం డా తరంగిణీకూలంబున నిస్తబ్ధుడయి నిలువబడి యుద్విగ్నచిత్తంబుతో విశ్వరూపాకావ్యమును విలోకింపుచుండెను. అంత వంశీనాదముతోబాటు తన్నెవరో "రా! రా"మ్మని యాహ్వానింపుచున్నటుల స్ఫురింప, "ఇదిగో! వచ్చుచున్నాడను, ఈ రాజప్రాసాదాది భోగ్యైకవస్తువాహనములు మదానంద కారణములుగావు." అని ప్రత్యుత్తర మొసంగెను. తనజనకుని విశాలోన్నత రాజమందిరముకంటె నరోత్తమునకు శ్రీకృష్ణ భగవానుని యొకసాధారణంబగు మందిరమే విశేషానందదాయకముగను, సుఖమయంబుగను బ్రతీతమయ్యెను. అతడు తిరిగి యీచందమున వచించెను:— "నేను షడ్రసోపేతాహారము నొల్లను—దీనుల పగిదియు, నిర్ధనుల విధంబునను శుష్కాహారమునే సుధాసమానముగ భావించి స్వీకరించెదరు." ఐశ్వర్యములను భోగవిలాసంబులను బహిష్కరించి నరోత్తముడు భగవత్సేవయందే నిశ్చలంబును నిర్వికారంబును నగు ప్రేమమయానంద సౌఖ్యసుధారసమును గోరెను. శ్రీకృష్ణభగవానుని ప్రేమమయంబగు మృదుల శీతల సుమధుర మనోహర మురళీసందేశ సంగీతము చోరులను, జారులను, ఘాతుకులను బహిష్కరించి వారికి నూతనజీవిత పారితోషికముల బ్రసాదించి యుండెను. ప్రజాసాధారణమునకు దుస్సహ దురం

తదుఃఖ నిలయంబగు కారాగారంబున బంధింపబడనున్న యొక భక్తశిఖామణి యిట్లు వచించియున్నట్లు వ్రాయబడియున్నది:—"శ్రీకృష్ణ భగవానుని చరణకమలోపాసన యందు నిమగ్నుండనగు నాకు రాజమందిరములును, కారాగారములును, మృదులహంస తూలికా తల్పంబులును, తీక్ష్ణ కంటకాకీర్ణ కర్కశ శిలామయప్రదేశంబులును సర్వకాల సర్వావస్థల సమంబులే యగును." మురళీ సందేశము వంగ దేశమును నూతనత్వముచే వికాసభాసుర మొనరించినది.



### 3 క్రమము, గ్రంథనము.

శ్రీకృష్ణసందేశమే సమన్వయనిర్దేశమని నేను వచించియున్నాడను. శ్రీకృష్ణ భగవానుడు దానినే గీతయందు రాజయోగమని నుడివియున్నాడు. నాబుద్ధి కీశబ్దమునకు రెండర్థములుకలవని తోచుచున్నయది. ప్రథమరాజయోగము సకల యోగములలోని కెల్ల ప్రధానమైనది. ఎందువలనన నిందే సమస్తయోగసంయోగము కలదు. ద్వితీయ రాజయోగము రాజమార్గమును ప్రదర్శింపుచున్నయది. సాధనపథము మహత్తరమైనది. కారణమేమన మీయందును మాహాత్మ్యము కలదు. "ఈమార్గము ననుసరించునట్టి యోపథికులారా! మీరు నిర్బలులును, నిస్సహాయులును గారను రహస్యము నెఱుంగజాలకపోయితిరా? మీరందరును రాజపుత్రులరు! మీరలే

సనాతన జాతి యొక్క సంతానము!" తనజీవితకాలమునందలి యూదులతోడ క్రీస్తుభగవానుడిట్లు వచియించెను:—"మీరీశ్వరులు!" కాని వారీమర్మము నెఱుంగజాలకపోయిరి వారు కేవలము "రాళ్లనురువ్వి వీనినిజంపుడు, చంపు"డని మాత్రమే యరచిరి. సిలువవేసి యంతమునకు క్రీస్తుప్రభు ప్రాణముల వార లపహరించిరి. క్రీస్తుదేవుడు కేవలము ప్రాచీనసత్య సందేశమునే బుచర్వచించెను. అతడు సిద్ధపురుషపుంగవుడు. శ్రీకృష్ణచంద్రుడు సుఖితమిట్టి స్వయంప్రబుద్ధుడగు సిద్ధుడె. సిద్ధులు విశ్వవలయమునం దల్పసంఖ్యయందే విద్యమానులయి యుండుచుందురు. కాని వారు సకలమానవుల సమ్ముఖంబున నుద్దీపితాదర్శమును వెలయింపజేయ సమర్థులు. ఇతిహాసము యొక్క కారణములను గుర్తెఱుంగునట్టి సహనశీలత్వము వారియం దుండుటయే దీనికి హేతువు వారు వికాసార్థమును గ్రహించియే యుందురు. వారు యుగముల యొక్క కారక్రమగతి నవలోకింపుచుందురు. ఈక్రమమును, గ్రథనమును దివ్యములయినవి. కొందఱు మానవుని పగునట్టి జంతువనియు, మఱికొందఱగ్నిని మండించు పశువనియు, ఇంకగొందఱు భాష నుచ్చరించు ప్రాణియనియు, మఱికొందరు విశ్వాస ఘాతుక కృత్యములను, మోసము చేయునట్టి మిథ్యాభాషణ పరతంత్రమగు జీవమనియు బలువురు పలుభంగుల వచింపుచున్నారు. ప్రొఫెసరు రిచేటు మహాశయు డొకపుస్తకమునందు "మానవు

డొక మూఢు" డని వ్రాసియున్నాడు. కాని సమదర్శులగు సిద్ధమహాపురుషులు మానవునియం దుండు పశుత్వమున కతీతమగు దివ్యప్రేమతత్త్వమువైపునకు మన ధ్యానము నాకర్షించుచున్నారు. దాని వికృతికిని, భ్రాంతికిని, మోహా జ్ఞానములకును బాహ్యమయి మనుజులయం దుండునట్టి యజ రామర తత్త్వమును, ఈశ్వరీయసారము నద్దానినే దర్శింప జేయుచున్నయవి. "మీ రాత్మసంబద్ధులరు! మీయం దీశ్వ రీయ జీవరసము తరంగితమగుచునేయుండును! మీరు నిస్స హాయులు కారు! అనాథులును గారు! మీరు పౌరుషశూన్యులు కారు! మీ హృదయాంతరాళముల నొక భీషణంబగు శక్తి వెలయుచున్నయది." ఓ భారతీయ నవయువకులారా! ఏదివస మున ఏసమయమున మీకీ రహస్యము హృదయంగమం బగునో ఆక్షణమందునే మీరు సంసారము యొక్క రాష్ట్రమం డలియం దాత్మీయ మస్తకముల నున్నతములు గావించుకొని యుండ సమర్థులయ్యెదరు. భారతమాతృ దాస్యశృంఖలములు నాడే విదీర్ణములగును. మీ దివ్యదేశము స్వతంత్ర రాష్ట్ర మయి రాణించగలదు.

శ్రీకృష్ణచంద్రుని రాజయోగ మా ప్రభుసత్తముని మురళీ సంగీతమువలెనే యొక సంయోగము. అద్దానికి ముఖ్య ములగు మూడు భాగములుకలవు. 1 ధర్మయోగము 2 భక్తి యోగము 3 బుద్ధియోగము. ఈ మూడింటికి వేర్వేఱుగా

3 విభాగములుకలవు. ధర్మయోగమునందు దానము, జ్ఞానము, తపము, సమ్మిశ్రితములయి యున్నవి. ఇవి మానవుని ప్రత్యేక కర్తవ్యములు. ఆధ్యాత్మికత్వ మనునది ధర్మమునుండియు జీవితకర్తవ్యముల నుండియు, జీవితావసరముల నుండియు దూరముగా నుండుటకు బోధించు తత్త్వముకాదు. ఆధ్యాత్మికత యొక సర్వోత్తమంబును, సర్వ శ్రేయస్కరంబు నగు విజయము. ఇది ధర్మపలాయనము కాదు, దివ్యజీవితము. ఏనాడు భరతఖండము ధర్మమునకు జీవితరంగమున ప్రాముఖ్యత నొసంగక యద్దానిని విడిచిపుచ్చి యుండెనో, నాడే దేశ మధఃపతనమునకు పాల్పడినది. శ్రీకృష్ణభగవానుని దివ్యాదేశము కింకర్తవ్యవిమూఢత్వమును నైష్కర్మ్య వాదమును అకర్మణ్య విధానమును బోధించు దుష్ప్రబోధ మెంతమాత్రమును గాదు. ఆధ్యాత్మికత యొక దివ్యశక్తి. ధర్మమాత్మ యొక్క చైతన్యము. ఏకార్యమువలన నాత్మ జీవితము, తత్ప్రకాశము, తచ్ఛక్తులు విస్ఫుటితములగునో, ఆకార్యము లన్నియు, నిత్య పరిశుద్ధములు; సర్వగ్రాహ్యములు. ధర్మమొక యాసక్తి కాదు. ఈశ్వరభక్తి ప్రేరితమగు కర్మమయ సేవయే ధర్మము.

మీ యధోభాగంబునను, ఊర్ధ్వభాగంబునను, అంతరాళంబునను సర్వేశ్వరుడే వెలయుచున్నాడు. ఏతత్కారణంబుననే మీకర్తవ్యములును ప్రధానములు మూడు- దానము యజ్ఞము, తపము. దానార్థము కేవలము పరోపకారనిమిత్తము

ధనమును బ్రదానము సేయుటయే కాదు; ప్రేమను, సహాను భూతిని బ్రదర్శించుటయు దానమే కేవలము భిక్ష నొసంగు టయే దానముకాదు, సంసార పరిహితేచ్ఛయు దానముకాదు; ఆదరపురస్సరంబుగ సలుపబడు దీనులసేవయే యుత్తమదానము. దానమనాథులపూజసేయుటయే. అభిమానాహంబ్రహ్మత్వములచే నాడంబరము నిమిత్తమును, ఆత్మశ్లాఘార్థమును సలుపబడు దానమును, దరిద్రనారాయణ సత్కారమును దానమని వచింపబడవు. దీనులపైన స్వామిభావమును వహింపకుడు. వారి సేవా శుశ్రూషల సేయుచుండుడి కారణమేమన వారును భగవదవయవములె. దీనులకు మీభాగమునే ప్రదానముసేయుడి. భక్తిశూన్యమగు దశసహస్ర రూప్యముల దానముకంటె బ్రార్థనాశ్రుకణ మొక్కటియెయైన శ్రేయస్కరంబును, సంపూజ్యమునయి యున్నది! ఆహో! శ్రీరామచంద్ర! దీనదుఃఖితులగు దరిద్రుల విషాదము మీదనే వర్తమాన సంఘవ్యవస్థ యాధారపడియున్నది. అధునాతన నాగరకత ధనాఢ్యుల భోగవిలాసముల నిమిత్త మీ దీనుల జీవితముల నాహుతిగా గొనుచున్నయది పతితులకును, పాపాత్ములకును దీనశ్రేణియందే స్థాన మొసంగుచున్నాడను. అపరాధియు మనుజుడె. వానియందుసయితమీశ్వరీయ విభూతి కలదు, కాని పదదలితమయి యున్నది. కారాగారములసంస్కరణము పరమావశ్యకము. పతితులను, దీనులను, హీను

లను శ్రీ కీస్తుప్రభూత్తముం డాదరపూర్వకంబుగ నాశీర్వదించి యుండలేదా ? శ్రీకృష్ణచంద్రుని విషయమయి యొక యుదంత మీచందమున బ్రసిద్ధమయి యున్నది :— "ఒకతూరి పతితయగు వేశ్యాంగన యొకర్తుక శ్రీకృష్ణచంద్రుని పాదరాజీవంబుల నాత్మీయ మస్తకమును వ్రాల్చి రోదింప నారంభించెను. ఈదృశ్యము నవలోకించి యట నుపస్థితులయియున్న రాజనందనులు క్రుద్ధులయిరి. వారంత భగవానునిట్లు పృచ్ఛించిరి. "ప్రభూ! మీరీదురాచారిణియు, కులటయునగు వారాంగన నేల మీపరిశుద్ధ పాదపద్మముల నపమానితములగ స్పర్శముచే జేయనిచ్చుచున్నారు?" ప్రేమమయుండగు శ్రీకృష్ణభగవాను డంత మృదుల మందహాసము జేయుచు నీచందమున వచియించెను :—"నాయనలారా! మీర లామెను నిరోధింపకుడు. ఆమె జ్ఞానమునందు మీకంటె నాధిక్యమును వహించియున్నది; కతనమేమన నామెయందు శ్రద్ధయూ, ప్రేమయు మూర్తీభవించి యున్నవి." పతితులును మానవులె. దీనులును, దుఃఖితులును బరమాత్మని యంగప్రత్యంగములె. సకలజీవరాసులునయితే మింతియె. వానియందును దైవిక చైతన్యము మానవునియందుకంటె దక్కువ పరిమితియందు విద్యమానమయియున్నది. భారతీయాదర్శములు క్రమముగా బశ్చిమదేశీయ స్త్రీపురుషుల వశీభూత మొనర్చుకొనుచున్న యిక్కాలమున భారతీయ శిక్షితనవయువకులు పాశ్చాత్య నాగర

కతా వ్యామోహ పాశబద్ధు లగుచున్నారు. దేహారోగ్యము నకును, దేహబలమునకును మాంసాహారము పరమావశ్యకం బని వచించుచుండు యువకుల నెందఱినో నేను చూచియు న్నాడను. వాస్తన మాలోచింప మనుజులమగు జీవవస్థాన మునుండి శరీరారోగ్య పదార్థమునకు వెలకు దీసికొనగలమా? అబద్ధ మబద్ధము, అసంభవము, అవివేకము!! సత్వరము మాంసభక్షణమును ద్రికరణంబుల ద్యజించివైచి, సకల పశుపక్ష్యాది ప్రాణిసంతతులతోడ విశుద్ధప్రేమభావంబున విహరింప గర ములు జోడించి యెల్లరకు మ్రొక్కులిడుచున్నాడను. ఈ చరాచరాత్మకజగమునం దాజీవములును మన సహోదరులే సుమీ!" నశ్వరమగు నాకృతి గౌణికమె. అవియును వికాసాభ్యుదయ సోపానపంక్తుల నధిరోహింప బాధ్యతాయుతములే యయి యున్నవి. అవియును బ్రేమమయుండగు సర్వేశ్వరుని రూప ములె.

ఈశ్వరారాధనమే యజ్ఞార్థము. వర్తమాన భరతఖం డము తన పరమాత్ముని విస్మరించి వైచు టెంతశోచనీ యము! ఈకారణంబుననే మనము నిర్బలులమయి, వికృత పథానుసరణంబున భ్రష్టులమయి పోవుచున్నారము. యజ్ఞము మననిత్యకృత్యమగు గాత! ఈశ్వరప్రార్థనమునం దపూర్వమగు శక్తి యంతర్భూతమయి వెలయుచున్నయది.

తపము యొక్క యర్థ మాత్మసమ్మానము లేక యాత్మ నిగ్రహము. నవయువకుల కవశ్యసత్వరాచరణీయంబగు త్యాగమే తపము. ఇట్లుండియు బ్రస్తుతకాలమునం దనేకులగు యువకులు భోగవిలాసాంబుధిని మునిగి తేలుచుండు టెంతయు జింత్యము. బ్రహ్మచర్యవ్రతపరిపాలనమే జీవితలక్ష్యమను జ్ఞానమంతరింప నిక్కాలమున భారతీయవిద్యార్థి బృందము యొక్క ధ్యేయము నింద్యము ను, క్షణికంబును నగు భోగ విలాసమే యయినది. ఈ త్రిధాభక్తియే—చేతన జగత్తు యొక్క సర్వేశ్వర స్వరూపమునందు ప్రేమ, ఆదిపురుషుం డగు పరమాత్మునిపట్ల భక్తి, ఆత్మ యొక్కయు, దచ్ఛక్తుల యొక్కయు జ్ఞానవికాసములను త్రిమూర్తికర్తవ్యములయి వెలయుచున్నయవి—ధర్మయోగము యొక్కయు—కర్తవ్య నిగ్రహముయొక్కయు మహోద్యోగసారాంశమేయిది. స్వదేశ ము యొక్కయు, సర్వాంతర్యామియగు సర్వేశ్వరుని యొక్క యు వాస్తవికంబగు కైంకర్యమే యువజనప్రపంచమునకు బర మప్రయోజనకారియగు సత్సాధనము. అన్యయోగద్వయము (భక్తియోగము, బుద్ధియోగము)ను గూర్చి స్థానాభావముచే నధికముగ వ్రాయజాలను. భక్తియోగమందును ద్వివిధతత్వ ములు విరాజిల్లుచున్నయవి. 1 అనురాగము, 2 శ్రద్ధ, 3 ధృతి యనునవి.

అనురాగము—అభిలాష—ఆత్మోత్కంఠ. రిచార్డు వేగనరను నొకసంగీతప్రియుడగు పశ్చిమదేశీయ దార్శనికు

డీభావమును "ఫ్లయింగు డచ్ మెన్" అను నాత్మీయగ్రంథము నం దెంతయు మనోహరముగా జిత్రించియున్నాడు. రాధ, మీరాబాయి మొదలగు భగవద్భక్త పరాయణలగు లలనా ప్రభృతులువంటి వనితామణులు ప్రతియుగమునం దీభావన యొక్క సౌందర్యానుభవమునే పడసియున్నారు. అనురాగ ములేనిదే భగవత్సాక్షాత్కారము లభ్యమగు నను విషయము గగనకుసుమమువంటిది.

శ్రద్ధ—విశ్వాసము. ధృతియొక్క యర్థము దృఢత్వము లేక సుస్థిరత్వము. ఏతదుభయశక్తులును, భక్తిభావమునకు బరమావశ్యకములు. అనురాగము నయిత మొక మనోహరమగు భావమె. భక్తి కేవలభావనయే కాదు. ఉత్కంఠయందు మన మశ్రుమోచనము సేయుచుందుము. కన్నీటిధారయు నొకయక్షయంబగు సంపన్నిధియె. కాని నేననేక మనుష్యుల బ్రార్థనసమయమందు నేత్రకమలములనుండి పాషాణముల నయితము ద్రవింపజేయు నవిరళాశ్రుధారల వర్షింపజేయుచు కార్యరంగమున బ్రవేశించినంతనే యాత్మీయభ్రాతలకంఠముల స్వార్థసిద్ధికయి నిర్దయులయి, కర్కశహృదయులయి యుత్తరింపు చుండుట నేను ప్రత్యక్షముగా నవలోకించియుంటిని. వారల నేను సోదరమానవుల తప్తరుధిరధారల నవిరామగతిని గ్రోలుచుండ నవలోకించియుంటిని. సంసారమునం దనేకమానవులు భజనకాలమందు శ్రద్ధాభక్తుల మూర్తులోయను చంద

మున గన్పట్టుదు, అనంతరము కార్యాలయంబుల బ్రవేశించి లంచములను బట్టుటయందును, నింద్యాతినింద్యములగు దుష్కర్మల నాచరించుటయందును వెనుకంజవేయకుండుట నేను గాంచియున్నాడను. ఇట్టిమనుజులయం దవశ్యము భావన యుండుచునే యుండును; కాని యది క్షణస్థాయియె. అట్టి వారికి గరుణానిధియగు సర్వేశ్వరునిపట్ల జిరస్థాయియు సచేతనంబును నగుశ్రద్ధ కొఱవడియున్నది. వారియం దీషణ్మాత్రమయిన ధృతియైన లేదని నొక్కి వక్కాణింపవచ్చును. మీభక్తి సుస్థిరంబును, సుదృఢంబునయి వెలయుచుండ వలయును. అద్దానిని ముఖ్యముగా గార్యరూపంబున బరిణమింపజేయ గృషి సల్పుడి. పరమేశ్వరునిబడయు వాంఛను వాగాడంబరమునగాక, సజ్జీవితంబునను, జీవసేవామార్గపరిగ్రహణంబునను వెల్లడించుటుచితము. వాస్తవికమగుభక్తి యొకదివ్య మగుశక్తి. యథార్థభక్తుడు కేవలము సౌఖ్యానందమయస్వరూపుడయి యంతటితో దనివిజెందియుండక, నిజామూల్యశక్తి నంతయు సర్వేశ్వరసేవయందే వినియోగింపుచుండును. ఈయాకాంక్షయే శ్రద్ధాదృఢత్వములతో నేకీభవించి ప్రేమజ్యోతి నుద్భాతము సేయును. ఇట్టివాస్తవికంబగు భక్తివిషయంబుననే సుప్రసిద్ధ దార్శనికుండగు ప్లోటినసుమహాశయు డీమహాత్వపూర్ణములగు శబ్దముల నుచ్చరించియున్నాడు:—“మనము భాషింపుచున్నారము, లిఖియింపుచున్నారము—ఎందునిమిత్తము? దగ్గ

నాపేక్షాసంపన్నులకు కేవలము పథమును బ్రదర్శించుటకే సుడీ! మనవచనములు వారిని జీవితలక్ష్యమువైపున కాకర్షించు చుండును. ఉపదేశములద్వారా సత్పథముయొక్కయు సన్న్యయము యొక్కయు జ్ఞానము లభ్యమగుచుండును. దర్శన ప్రాప్త్యభిలాష ప్రత్యేకాత్మవిధి. త్రివిధప్రయత్నానంతరం బును భగవానుని దర్శింపజాలనట్టివార లెందరో కలరు. కారణమేమన వారియాత్మ లాయనంతవైభవమును బడయజాలక పోయినవి. వానియం దుత్సాహము లేదు. జ్ఞానసంపాదననిమిత్తమవ్వానియందు ప్రేమజ్యోతిప్రభావము లేకుండెను. వారి హృదయములు ప్రేమమార్గమగు పథార్థాభావముచే బరివేష్టితములయి యుండెను. వారు పరమప్రకాశము యొక్క వికాసమును బడసియే యుందురు కాని క్రమక్రమముగా వారా జ్యోతిని సమీపించినంతనే వారియాత్మ లత్యుజ్జ్వలము లగుచుండెను కాని వారిశీర్షము లధికభారావనతములయియుండు కతన వార లాపావనప్రకాశమందిరమును బ్రవేశింపజాలక పోయిరి. వారలాత్మీయాత్మ కాగ్రితావలంబనమున నున్న తపథము ననుసరింప జాలకపోయిరి. సాంసారిక వ్యామోహము లేక స్వార్థభారము వారి నాపరిశుద్ధవిజయమునుండి నిరోధించివైచినది. వారి యాంతరికప్రదేశంబుల నింతపర్యంత మద్వైతభావోదయము కాజాలదయ్యెను.”

బుద్ధియోగము నయితము తత్త్వత్రయంబున నీరీతి విభజింపబడియున్నది—1. వివేకము 2. విజ్ఞానము 3. విశ్వసందర్శనము.

క్షేత్రక్షేత్రజ్ఞవిభేదతత్త్వ పరిజ్ఞానోదయం బయినం తనే వివేకప్రాప్తి మనుజునకు గరగతంబగును. ఆత్మయు, బాహ్యపరిస్థితియు నొక్కటికాదు. శరీరము జీవాత్మనుండి భిన్నమయిన పదార్థము. మీకు బరిస్థితి పరమావశ్యకమే యయియున్నను మీ రద్దానికంటె మహద్విభవసంపన్నులరు గావలసియున్నది. మీ దేహ మావశ్యకమయిన పదార్థమెకాని యది మీకొక వాహనముమాత్రమే యయియున్నది. ఆ వాహనముకంటె మీరధికంబగు మహత్తుకలవారు. ఙిమ్ము మీరు భ్రమించువిధంబున నంతటిహీనులును, బలిరహితులును గారు. మీరలనంతశక్తిసంభూతులరు. మీయందు మహత్తరంబగు కార్యసమానశీలత్వము నిహితమయియున్నది. మీయందు దివ్యమగు చిచ్ఛక్తి వలయునంత కలదు. మీకు మీపూర్వ పుణ్యపురుషావతంసముల యొక్క ప్రచండదుర్జయతేజఃపుంజము ప్రాప్తమయియున్నది. మీ రెల్లరు రాజకుమారులరు. కాని మీ రెల్లరాత్మీయ వాస్తవిక స్వరూపంబుల విస్మరించి యున్నారు. ఏతద్హేతువలననే మీ రల్పపదార్థముల నిమిత్తమును, లఘువాంఛాపూర్తికి నటు నటు వృథా పర్యటనము సలుపుచున్నారు. వివేకోదయ మేరీతినగునదియు లేక మీ రేప్రకారము స్వీయ

సత్యస్వరూపము నవలోకించుటయు నిట విస్తృతరూపంబున నేను లిఖియింప వాంఛించుటలేదు. ఇద్దాని ననేక సాధనంబుల యొక్కయు, నిగ్రహంబుల యొక్కయు వర్ణనము పరమావశ్యకమయి యున్నది. మౌనసాధన మందొకటి. ప్రత్యేక నగరమందు మౌనవ్రతాభ్యసనశాలల కేంద్రము లేర్పడుట ముఖ్యము. మీరు మౌనముద్రను వహించినంతనే స్వీయవివేచనాశక్తి వికసితంబగును, మీయాత్మలు బాహ్యపరిస్థితుల నుండి భిన్నమయి యున్నటుల మీరలే స్పష్టముగా గ్రహింప సమర్థులయ్యెదరు. నాప్రియ మిత్రులారా! మీరు వ్యర్థమగు చాతుర్యమునకును, వృథా వ్యథోత్పాదకంబులగు కలహములకును స్వీయామూల్యసమయము నేల దుర్వినియోగ పఱచెదరు? మీరిపుడు ఖిన్నులును, క్లాంతులును, శుష్కజ్ఞానులునయి యున్నారు. ఇట్టి దుర్బలస్థితియందు మీరు మౌనవ్రతావలంబనము జేసి యద్దాన లభ్యమగు నపూర్వ సత్ఫలము నరయ వేడుచున్నాడను. కొన్ని మాసముల పర్యంతము మీరు మౌనముగానుండి సమయమును వ్యతీతము సేయుచో మీయం దొకయద్భుతంబగు నక్షయానందమయశక్తి యుద్భవింపగలదు. మీ రీరహస్యమును సాధనపూర్వకంబుగ బరిశోధించుకొనుడి. మీకే విశదముకాగలదు. మౌనవ్రత పరిపాలనా లభ్యంబగు నూతనశక్తి సంసారము యొక్క సకలసంపదలయందును దలమానికమయి వెలుంగును. ముని మహాత్మ

ఖ్య రాశియే; నిత్యానందమూర్తియే. ఏతన్మానోపలబ్ధంబగు శక్తి యొక్క దివ్యజాగృతి సకలవ్యాధిహారిణియగు దివ్యౌషధి.

విజ్ఞాన మొకసిద్ధి. మీరు బహిర్జగత్తునుండి మిమ్ము వేరు పఱచుకొని మానము యొక్క ద్వారమునుండి యాంతరిక ప్రదేశమందిరమును బ్రవేశించినంతనే సహజముగా "మన మెవ్వరము ?" అను విచారింబగు జ్ఞాన మొకటి యుదయించును. స్మృతి యొక్క కవాటము లంత బంధనవిముక్తము లగును. అపుడు మీకు స్వీయ రాజకీయ జన్మము యొక్క ప్రబోధము కలుగగలదు. మీ రపుడే యంతర్జ్యోతిర్మయావరణ మందు బ్రవేశింపగలరు. ఏతన్మహాసత్యము యొక్క దివ్య పరంజ్యోతిస్స్వరూపమును బశ్చిమఖండ దార్శనిక విద్వన్మణు లగు "బర్గ్సను, క్రోసు, యూకను" మొదలగు మహాయులు విలోకించియున్నారు. వారు దర్శనశాస్త్ర మీమాంసవలన నిద్దానిని జైతన్యము యొక్క వికాసమనియు—సహజబోధచే బ్రజ్ఞయు, బ్రజ్ఞచే సంశర్వవేకమును లభ్యమగునని విశద పఱచియున్నారు. ఈచైతన్యావస్థను బడయవలయు నని యెడి సదభిప్రాయముగలవారి సంఖ్య విశ్వమం దిపుడు బహుస్వల్ప ముగానున్నది. అధునాతనబుద్ధికి జీవితము యొక్క నిరాకారం బులగు మహిమలయందు విశ్వాస మొదవుటయే కష్టసాధ్య ముగానున్నది. కాని భరతఖండ మద్దాని ననేక శతాబ్దముల నుండి యన్వేషించుచునే యున్నది. జ్ఞానసముపార్జనమే

సమగ్రజీవిత మనంత ప్రస్తుతకాలము యొక్క యత్క్షయత్క్షణ మాత్రమే యయియున్నది. అట్టివాని కేధర్మముతోడను వైరభావ ముండజాలదు. కతమేమన నవుడవ్వాని కెల్లధర్మముల నొక్క సత్యస్వయంజ్యోతిర్వికాసమే గోచరింపుచుండును. వా డేరాష్ట్రమును ద్వేషింపడు. అతని కఖిలరాష్ట్రములీశ్వరస్వరూపంబగు మానవజాతియంగములుగనే స్ఫురింపుచుండును. వాడు పతితులను, పామరులను సయితము ప్రేమించును. కారణము పిపీలికాది బ్రహ్మపర్యంత మఖిల జగత్తునందు ప్రవాహరూపంబున జైతన్యత వ్యాపించియుండుటయు మానవమాత్రుం డొక్క దివ్యసృష్టియయి యుండుటయు వానికి బ్రథమావస్థయందే స్పష్టముగా విశదమయి యుండును. ప్రేమమయుండగు నతడు నీచుడును, పామరుడును జైతన్యమునకు వేఱుగానున్న పదార్థము కాదని వాడంతకు మున్నే గ్రహించి యుండును. పాశ్చాత్య నాట్యకారుండగు సుదరమేను తన హేరోడియాసను పేరుగల పాత్రముఖంబున జోన్ బాప్టిస్టు నిశ్శబ్దముల దిరస్కరింప జేయుచున్నాడు :—

"అపరాధుల యొక్క న్యాయమును విచారింప నీకేమి యధికారముగలదు? నీవు సాంసారికజీవితరంగమునుండి పలాయితుడవయి మరుభూమి యొక్క నీరవంబును నిర్జనంబును నగు స్థానము నాశ్రయించి యున్నాడవు. న్యాయాసనము నధిష్ఠింప సాహసించు వ్యక్తి సాంఘికప్రాణియయి, సాంఘికబాం

ధన్యమ్మున కిచ్చుకొని సహచరులతోడ మానవోత్తముని వలె వ్యవహరింపుచుండుట పరమావశ్యకంబని యెఱుంగజాలక పోయితివా?" అంతర్జ్యోతికి ప్రాపించిన మనుజుడు సకలమానవ జాతియందు ప్రేమభావమును గల్గి వర్తింపుచుండును. భేద భావము నతడు మాయయనియు, విస్మృతియనియు బూర్ణముగ గ్రహించి యద్దానినొల్లక బహిష్కరించి వైచుచుండును. కోల్పోయినస్మృతిని బునః బడసిన వ్యక్తికి నూతనశక్తియు, కర్మయొక్క నవీనాదర్శంబును ప్రాప్తించును. ఇందు వలననే విశ్వదర్శనానంతర మర్జునుడు శ్రీకృష్ణభగవానునితో నీవిధమున నుడివియుండెను :—"ఓయచ్యుతా! భవత్కృపా విశేషంబున నా వ్యామోహజాడ్యము నిర్మూలమయినది. పుణ్యజ్ఞానస్మృతి తిరిగి లభించినది. నాసకలసందేహములు మటుమాయములయినవి. నే నిపుడు మహత్తరంబగు భవద్వాక్యము సారంబుగ వర్తింప *గటిబద్ధుడను."

---

## ౪ ఎక్కడ?

ఆహా! ఏమి మురళీసందేశము! నే డెంతమంది యద్దాని దిక్కునకు ధ్యానమును బ్రసరింప జేయుచున్నారు! 15 సంవ

---

*శ్లో:— నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయాచ్యుత,
స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ. —గీత 18—73.

త్సరములకంటె నధికసమయమే గతించినది. నేనపుడు పశ్చిమ ఖండమున బర్యటనము సలిపి భరతఖండమునకు మరలివచ్చి యుంటిని. నేను స్వదేశమునకు మరలివచ్చినంతనే నాకు భరత మాత పాదారవిందములయం దపారమగు భక్తి ప్రగాఢము గా దొడంగెను—అపుడే భారతీయాదర్శముల పట్ల నాకు మిక్కుటములగు శ్రద్ధాభక్తులు కలిగెను. పశ్చిమభూభాగ పర్యటనానంతరము నేను భరతఖండముయొక్క పరిస్థితుల నాద్యోపాంతముగ నవలోకించి యిట్లు భక్తిగద్గదకంఠముతో బృచ్ఛించియుంటిని :—"ఓదయామయా! నాతండ్రీ! నీవెట నున్నాడవు!" నేనంత దేవళంబుల కరిగితిని, వానిని దీర్ఘదృష్టితో బరిశీలించితిని, కేవల మవి వృత్తిస్థానంబులేయని గ్రహింపగల్గితిని. అందెన్నియో వ్యభిచారాదిసృత్తులకు నిలయములే యయియుండుటయు దెలియకపోలేదు. మగల నిట్లు విన్నవించుకొనియుంటిని :—"ఓప్రభూ! నీవెచ్చోటనుంటివి?" అంత నేను విద్యాలయంబుల యందును, విశ్వవిద్యాలయములందును జూచితిని. అందును నేను గేవల మనుకరణాత్మక ప్రవృత్తు లభివృద్ధిసేయబడుచుండుటయే కానవచ్చెను. వాని యందు సర్వశ్రేష్ఠములగునవి, కర్మశూన్యంబును, ఉత్సాహవిహీనంబును నగు బుద్ధియొక్క కేంద్రస్థానముల మించియుండలేదు. ఆత్మసంస్కృతి యెచ్చటను మందునకయిన గానరాదయ్యె. నేనంత నీరీతి బృచ్ఛించితిని:—"అనాధనాథా! జగత్ప్రి

భూ! నాతండ్రీ! నీవెటనున్నాడవు?" నేను శిక్షితయువజన మండలియొక్క వదనమండలముపైపునకు నాదృష్టిని బ్రసరింప జేసితిని. వా రనేకకార్యములయందు లగ్నమనస్కులయి యు న్నటుల నాకు విశదమయ్యెను; కాని వారు జీవితపరమావశ్యక వస్తువును—ఉద్ధారకంబగు భగవత్పదార్థమును సంపూర్ణముగ మఱచిపుచ్చిరనే యున్నటుల నాకు దెల్లమయ్యెను. అంతనేను తిరిగి యిట్లడిగితిని:—"ఓభగవానుఁడా! కృపాసింధూ!! ఎచ్చో టనున్నాడవు?" అధునాతనకాలమందలి కోలాహలమందును, వ్యర్థాడంబరమందును జగదీశ్వరుని గాంచలేకున్నాడను. వివిధ మానవదళములందును మతమతాంతరముల భీషణకలహంబు లందును జగదేకచక్రవర్తి—విశ్వప్రేమానువర్తి— శ్రీకృష్ణ చంద్రమూర్తి గోచరింపకున్నాడు. సభ్యత కేవలమిపుడుసయిత మార్థికభౌతిక వాదముయొక్క శాసనమాత్రముగనేయున్నది. ఇప్పటికిని భరతఖండమును—శ్రీకృష్ణభగవానుని పవిత్రజన్మ స్థానంబగు భరతఖండమును నిందమ్యమును, సత్వరత్యాజ్యమును నగు సామ్రాజ్యవాదము పాదదలిత మొనరించివేయుచున్న యది. జాతీయాహంబ్రహ్మత్వముయొక్క విజయఘోష భువి యం దెల్లెడల బ్రతిధ్వనింపుచున్నయది. హిందూసంఘము నిపుడు సయిత మనేకవర్ణములయందు విభజింపబడియుండుట జూచి నేనెంతయు లజ్జింపుచున్నాడను. ఇప్పటికిని క్రైస్తవ దేవ స్థానంబుల (బ్రార్థనామందిరములు) భేదభావోత్పాదకంబు

లగు మతముల ప్రభుత్వమే నిర్విఘాతముగా సుస్థిరరూపం బున నెలకొనియున్నది. ఇంక నిపుడును ధనముయొక్కయు, ప్రభుత్వముయొక్కయు గర్వాంధత, దీనులును, కరుణామయులును నగు నిర్ధనుల నిర్దయభావంబుతో గాళ్లందొ్రక్కి వేయుచున్నయది. నేను సకలజీవసంతతుల—భగవానుని యవయవముల పదస్థానంబుల కీడ్చుకొనిపోవుచుండుట నింకను జూచుచునే యున్నాడను. నా దుఃఖ తాంతఃకరణము నిశీథముయొక్క గభీరనిస్తబ్ధతయందును, ప్రభాతవు యొక్క సుస్నిగ్ధమంజుల నీరవతయందును జీటికిమాటి కిట్లు ధ్వనింపుచున్నయది :- 'ఓకృష్ణా! దీనసంరక్షకా! రా! రమ్ము! దీర్ఘకాలమునుండియు మేము నిన్ను విడిచిపుచ్చినారము! భారతమాతయొక్క కరుణాంతఃకరణము సంపూర్ణభక్తిభావంబుతో నిన్నాహ్వానింపుచున్నయది. వేంచేయుము! పీడితంబును, విపద్గ్రస్తంబును, ప్రేమభావ విరహితంబును, భయభావవ్యథితంబును నగు మానవజాతి నీని మిత్తమాక్రందింపుచున్నయది! విజయము సేయవేల? ఓనాకన్న తండ్రి! కృపానిధీ! రావా? జాగేల? రమ్ము! ఈ ప్రాచీనజాతియొక్క దివ్యసత్యసందేశమును, మధురసంగీతమును సమగ్రవిశ్వమండలమునకు జాటిరమ్ము! ఓదయామయా! దయచేయవా? శీఘ్రమే శీతలదయాసుధారసార్ద్రహృదయంబుతో వేంచేసి యీ సంసారమును బ్రేమయొక్కయు, సత్యజ్ఞానజ్యోతియొక్కయు శుద్ధప్రకాశముచే భాసురము గావిం

పవా? తండ్రీ! ఈ నీకుర్రవాని మొరాలింపుము! తామసిం పకు!" అంత నాహృదయాంతరాళమున శ్రీకృష్ణభగవాను నీదివ్యవాణి ప్రతిధ్వనించినది:—"కుమారా! ఇదిగో! చూడు మీదిక్కు! నేను ప్రేమమయదృక్కుల బ్రసరింపజేయుచు మీసన్నిధికి వచ్చుట కుత్కంఠితచిత్తుడనయి నిలువబడియున్నా డను, కాని మీరు నాస్వాగతమునకయి మీహృదయ కవాట ముల దెఱువరయిరేమి? అధరబింబముల దివ్యమురళినానిచి నేనైక్యతయొక్క సుందరమహద్గానము నాలాపించుటకు సన్న ద్ధుడనయి యున్నాడను, కాని మీరు కలహాశనము వర్జిం తురా, లేదా? నేను సత్వరమే యేతెంచి సమస్తజాతులయం దును రాష్ట్రములందును, ధర్మములందును మైత్రిభావమును సుస్థిరముగా స్థాపించ నుత్సుకుడనయి యున్నాడను, కాని మీరు నాత్వికాభీష్టమును స్వహితమునకయి నిర్వహింపరా?" ప్రియ భ్రాతలారా! మీరు నిర్వాసితుండగు భగవానుని దిరిగి భక్తిపూర్వకముగ నాహ్వానింపుడు! మీ మీనగరములం దును, మీప్రభుత్వములందును బ్రభుసత్తను నాహానించి నెలకొల్పుడు! ఆ పరమపితకు స్వీయరాజనీతియందును, సంస్కృ తియందును, దినచర్యయందును సమున్నత స్థానమును దిరిగి ప్రదానము నేయుడి! సకలవ్యాధుల సమూలముగ నశిం పజేయు సారితంత్ర్యము వైపునకు బ్రేమమూర్తియగు నా శ్రీకృష్ణమూర్తి సకలరాష్ట్రముల శీఘ్ర మాకర్షించు గాత !!

---

# రాధాన్వేషణము.

"భక్తిచేతనే నన్ను బడయగలుగుదురు."—గీత.

## ౧. ఉన్నతైక్య భావము.

అతడు నన్నిట్లడిగెను—"భక్తి యననేమి?"

నేనుత్తర మిట్టులొసంగితిని—"రాధాన్వేషణమె."

* విద్వాంసుడగు నరస్తూమహాశయుడు సర్వేశ్వరునికి విజ్ఞుడు, ప్రవర్తకుడు, సర్వజ్ఞుడు, ఆదిప్రేరకుడు, అచలుడు, సంచాలకుడను విశేషణంబుల బ్రయోగించియున్నాడు. అరస్తుయొక్క భగవానుడు విశుద్ధప్రేమమయుడు కాడు. జ్ఞానముయొక్కయు, ప్రేమయొక్కయు, చరమాభాసము నరస్తు విలోకింపజాలడయ్యెను. పండితులయొక్కయు, విద్వన్మణులయొక్కయు, చూడామణియగు నతడు విశ్వముయొక్క యనాదికర్త ప్రేమమయుండగు బ్రహ్మయని గ్రహింపజాలక పోయెను. విశ్వ మెవ్వానియన్వేషణంబున బరతంత్రమయి యున్నది? అనంత భగవానుడంగు శ్రీ కృష్ణచంద్రునే యని సులభముగా గ్రహింపజాలరా? జగత్ప్రేరకశక్తిని—వికాసప్రవృత్తిని రాధాన్వేషణమనియే వచింపదగును—ఆ రాధ

* ఇతడు క్రీస్తుశకమునకు ౩౮౪ సంవత్సరములకు పూర్వము జన్మించి 322 వత్సరములకు దొలుతనే మరణించియుండెను. ఇతడు గ్రీసుదేశముయొక్క సుప్రసిద్ధుండగు దార్శనికుడు, సకలవిశ్వదిగ్విజేతయగు నలెగ్జాండరు సార్వభౌముని కితడే యాచార్యుడు.

యెవర్తుక? సుమధుర మురళీ నినాదశ్రవణగత పంచప్రాణ— ప్రేమభావ పూరితచిత్త— నిత్యవిశుద్ధ విశ్వప్రేమారాధన తత్పరహృదయ. తనదివ్య ప్రభుసందర్శన మగునంతపర్యంత మాదేవికి విశ్రాంతి యెట నుండును?

మురళీనినాదమును తత్త్వేరితాత్మ యొక్క సర్వేశ్వర సమ్మేళనాభిలాషయును భక్తిప్రాదుర్భావమునకు మూలహేతువులు. ధార్మిక జీవితము నందు భావనకు సంపూర్ణముగా స్థానముకలదు; కాని కేవలము భావనామాత్రము వివేకశూన్యమయినదియై, భావన బుద్ధి నతిక్రమించి పోయినపుడు వైపరీత్యము ప్రకాశించును. ధార్మిక ప్రపంచమందు స్వీయానంద సౌఖ్యములనే జీవితలక్ష్యముగా నెలుంగువారే కారుణికదృష్టిచే దీనశ్రేణియం దగ్రస్థానము నంద దగినవారు. శ్రీకృష్ణభగవాను డీచందమున వచించియున్నాడు:— *"భక్తివలననే నన్ను గాంచెగలరు." అనేకులు ధర్మముచే జమత్కార లాలసను బూర్ణమొనరించుకొన జూచుచుందురు. ధర్మముచే విషయసుఖాభిలాషను నెరవేర్చుకొన జూచు టెంతయు నీచము! నింద్యము!! లజ్జాకరము!!! భక్తు డాకాంక్షను గల్గియుండును. అత డనంతములగు కష్టముల లెక్కసేయడు, సుఖదుఃఖములను జలింపడు. ఇందువలననే వానికి

* శ్లో:—భక్త్యా మా మభిజానాతి యావాన్యశ్చాస్మి తత్త్వతః
తతోమాం తత్త్వతోజ్ఞాత్వా విశతే తదనన్తరం—గీత 18—55

దివ్యమగుశక్తి లభ్యమగుచుండును. భక్తిప్రజ్ఞాహీనమందురా? అజ్ఞానిచే పరమోత్కృష్టనియమముయొక్కయు, ప్రేమయొక్కయు, ఉదారసిద్ధాంతము యొక్కయు సందర్శనము లభింపదందురా? దార్శనికులు సర్వేశ్వరుని తత్త్వనిరూపణ పరిశీలనంబులకే తమ యమూల్యకాలము నంతయు వెచ్చింపుచుందురు: కాని భక్తమండలి సర్వమును ప్రేమించుటనే స్వీయకర్తవ్యముగా భావించుచుండును. భక్తుడు భగవదుపాసనజేయును, ప్రేమవిశ్వాసంబున నాభగవానుని కృపాదృష్టికయి తహతహ పడుచుండును. ప్రభుప్రేమస్మృతియే భక్తహృదయమును వ్యథితమొనర్చుచుండును. వాడు సర్వేశ్వరస్మరణంబున ప్రేమభావస్మృతిచే నవిరళాశ్రువిమోచనము నేయుచుండును. విద్యవలెనే భక్తియు స్మృతిప్రధానమయినదియె.

కొలది దినములకు ద్రొల్లి నాకరపుస్తకమునం దీశబ్దముల వ్రాసియుంటిని—"అతడు వేంచేసినాడు, అతడు సర్వోత్తముడు, ఆతనిసౌందర్య మద్వితీయము. అతడేతెంచి నాయాత్మమందిర గవాక్షమునుండి తొంగిచూచినాడు—చూచి వెడలిపోయినాడు. తదాదిగ నే నావాతాయనంబున నాసీనుడనయి యాతేజఃపుంజ ప్రసారమునకయి నిరీక్షింపుచున్నాడను. అత డింతపర్యంత మేతెంచలేదు. అంత నాకన్దోయి కన్నీటిధారల గురియ నారంభించుచున్నయది. నాయాత్మ దీర్ఘకాల

ప్రతీక్షచే బీడితమయియున్నది. నా నెచ్చెలులారా! భగవాను డింకరాలేదు. అత డింకరాడా యేమొ తెలియజెప్పుడి. అతడు నన్నీ వ్యాధినుండి యుద్ధరింపడా యేమి?"

ఉత్కంఠయొక్క ప్రత్యేకాశ్రుబిందువు భక్తివృక్షమును, సంసిక్తమును, పుష్పితమూ నొనర్చుచుండును. భ్రాతలారా! విలాపముసేయుడి! కన్నీటిధారల గురిపించుడి! కాని హతాశులు కావలదు! ఈవృక్షమే యొకదివస మున్నతమయి గగనమండల దయాపాత్రము కాగలదు. పరమాత్మునిపట్ల గలుగు భావనామయంబగు సహయోగమే భక్తియనబడును. ఈభావమయంబగు ప్రవృత్తియం దొక్కకవిత్వలక్షణమును గలదు— దానినుండి యిట్టి వనేకతత్త్వములు ప్రకటితము లగుచుండును. అవి బుద్ధినుండి వేఱుగా నుండుచుండును. అంతఃకరణముయొక్క దృష్టి మస్తిష్కమున కెద్దియు గోచరింపని స్థానమును సయితము సులభముగనే సమీపించుచుండును.



## ౨ అనంత శ్రీకృష్ణభగవానుడు

క్రైస్తవధర్మ ప్రచారమునకు దొలుత భరతఖండమున భక్తిపదజ్ఞానము లేదని వచింప సాహసించుట ఐతిహాసికదృష్టి యందెంతయు నసత్యమయినది. ఉపనిషత్తుల గాంచుడు, రామాయణమును బఠించుడు— అవ్వానియందు వైష్ణవ

ధర్మోత్పత్తికి బూర్వమే యనేకశతాబ్దంబులకు ముందు భరత ఖండము భక్తిపథమునం దగ్రస్థానమును వహించి యున్నటుల సుస్పష్టము కాగలదు. భక్తివిషయమయి హిందూధర్మము క్రైస్తవ ధర్మమునకు గృతజ్ఞతను దెలుపవలసిన యవసరము గాని, క్రైస్తవధర్మము బౌద్ధ ధర్మమునకు కృతజ్ఞతను సూచించవలసిన యావశ్యకత కాని యెంతమాత్రమును లేదు. భక్తిపై నేధర్మమునకు ననన్యాధికార ముండనేరదు. భక్తి యొక్క జననము తనంతటనే మానవుని యాంతరిక ప్రదేశ మునుండి సంభవింపుచున్న యది. వైష్ణవకవీంద్రులు శ్రీకృష్ణా న్వేషణ పరతంత్రయగు శ్రీరాధికాముఖంబున గానము చేయించిన గీతము లెంత హృదయాహ్లాదకరములు! ఎంత శిక్షా ప్రదములు! నే నీదిగువ వంగరాష్ట్రము యొక్క తత్త్వవేత్త లును కవీశ్వరులునగు జ్ఞానదాసు చండీదాసుల యొక్క కొన్ని గీతముల భావానువాదమును బొందుపఱచు చున్నాడను. రాధ యిట్లు ప్రేమవిహ్వల హృదయంబుతో భక్తిగద్గదకంఠ మున నుడువుచున్న యది :—

"చీటికిమాటికి నాయంతఃకరణమందు 'ఓనాథా!
నీకు నే నేమీయగలను?' అను ప్రశ్న యుదయ
మగుచున్న యది. ఓనాథా! ప్రాణనాథా!
వచియింపవా? నేను నీచరణకమలముల నేమి యు
ర్పించవలయునో కనికరించి విశదీకరింపవా!

ఆత్మసమర్పణము కింతకుబూర్వమే సంసిద్ధనయియుంటిని:
నీపదార్థము నీకే లభించును,
నాకియు నీదియేకదా!
నాధనమంతయు త్వదీయమేకదా!
నాసర్వస్వము నీదియె! నీదియె!!
నాకు నీనుండి ప్రత్యేకత యెక్కడిది?
ప్రియునిమిత్తమే నేను సకలమును త్యజియించితిని,
నానాధునికొఱకే ఘోరాపమానమును లాలించితిని.
కాని యతడు నన్ను సమీపించ కున్నాడేమి? చెప్పుమా!
అయ్యో! ఇంక నీవిహ్వలహృదయము నూరడించుటెట్లు?
తన్నాథుని సుందరనామ మధురసంగీతము
వణములకంటె నధికగంభీరమగు దేశమును బ్రవేశించును.
అతడు నాహృదయమును మంత్రముగ్ధ మొనర్చినాడు!
ఇందువలననే నేను శ్రీకృష్ణచంద్రునినిమిత్తమున్మత్తనయితిని!
ఓనాథా! నీకు నేనేమి నివేదింప గలదానను?
జీవనమందు, అథవా మరణమునందు,—
అథవా యీజీవితముయొక్క యనంతర జన్మజన్మ
మందు నీరాధకు హృదయేశ్వరుండ వగుము!
ఇదియే మత్ప్రియ విహ్వలహృదయాకాంక్షితవరము!!"

వైష్ణవసాహిత్యమునం దనంత కృష్ణభగవానుని విశ్వ
ప్రతినిధిగ సంస్తుతించిన సజీవభక్తిరస ప్లావితకవిత లనేక

ములుగలవు. ఆసాహిత్యము శ్రీకృష్ణపాదాంబుజ సమర్పితము.- తత్సాహిత్య సరస్వతీ హృదయము ప్రేమనిర్మితము! విశ్వ ప్రేమాధీశ్వరుండగు శ్రీకృష్ణభగవానుని యనురాగమందే భక్తిజ్ఞానముల చరమసీమ వెలయుచున్నయది.



## 3. అపూర్వాలోకనము.

ఒకానొక క్రైస్తవ సాధుబాలికను గురించిన కథ యొకటీరీతి బ్రసిద్ధమయి యున్నది:—ఆమె యొక బాలిక. ఆమె బాల్యావస్థయందే మృత్యుముఖంబున బడియెను. ఆబాలికామణి వదన మతిసుందరము. ఆమెభక్తి యంతకంటెను లావణ్యమయ మయినది. ఒక యున్నతరోమకోద్యోగిశందను డామెపైముగ్ధుడయి యుండెను. అత డాకన్యకమూల్యరత్నాదికముల బ్రలోభనమును గల్పించెను. కాని యాబాలికారత్న మీచందమున ధిక్కరించెను:—"ఛీ! పో! పొమ్ము!! నాప్రేమధనసర్వస్వ మాక్రీస్తు భగవానుని కెపుడో సమర్పితమయినది. ఆమె విశాలాంతఃకరణమందు క్రీస్తుప్రభువుపట్ల నతిశయాను రాగ భక్తిభావ ముండెను. రోమకోద్యోగి యామెను దిగంబరను గావింప గఠినముగా శాసించెను; కాని యాసరళహృదయ మగు బాలికాశిరోమణి నిజకేశదామము లంబాయమాన మగుడు ఆదేవి యాకేశదామమునే వివముక్త మొనరించి శరీరము

నంపంతట నాచ్ఛాదిత మొనరించుకొనియెను. ఆకన్యయంతఃకర ణము భక్తిపరిపూరితము. భయవిషాదములయందే భక్తులు తమభక్తిభావబీజముల నాటుచుందురు; కాని వా రద్దానిఫల మును—గంభీరసుస్వరనినాదితంబును, సుఖమయదృశ్యసం భరితంబునగు నానందలోకమందే పడయుచుందురు.

భక్తి, పరమప్రేమయొక్క రూపమని మనము నారద సూత్రముల బఠించుచునే యున్నారము. పరమమను శబ్దమున కత్యంత ప్రగాఢమనియే యర్థము. సర్వేశ్వరు నెడగల్గు ప్రగా ఢమగుప్రేమయే భక్తి యనబడును. పరమమను పదము యొక్క యర్థము చరమమనియు, అనన్యమనియు నాయుద్దే శ్యము. అందు ప్రయోజనముయొక్క ప్రశ్నకు స్థానములేదు. అది నిర్హేతుక మయినది! నిష్కళంకమయినది!! నిరుపమాన మయినది!!! అది నిర్హేతుక మయియుండియు నకారణమయి నది కాదు. అందు ఫలప్రాప్తియొక్క యాచనములేదు, అయ్యది స్వార్థరహితమయినది. భక్తులు భగవానుని మధుర మంజుల మహనీయమూర్తియం దధికప్రేమభావప్రగాఢతను గల్గియుందురు. కారణమేమన నతడు—ఆశ్రీకృష్ణచంద్ర మూర్తి కల్యాణకరుండగు దివ్యప్రభువు. భక్తులు ప్రతిఫలాపేక్షా శూన్యులు, స్వర్గాభిలాషాదూరులు. "ఓభగవానుడా! కృపాసిం ధూ! ప్రేమైకమూర్తీ! దీనసంరక్షకా! నిన్ను హృదయపూర్వకం బుగ బ్రేమించుటకు నాకు భయంకరాగ్నికుండమగు నరకలోక

వాసప్రాప్తిలభించినను నేను పరమాహ్లాదచిత్తముతో మృదుల హాసము సలుపుచు స్వీకరించెదను. నీయందు నాకు ప్రేమోదయమగుటకే నాయీజీవితము ఇంతపర్యంత మున్నది. ప్రభూ! తండ్రీ! ఈ నాయభీప్సితము సార్థకముకాదా!" ఇవి పరమసాధువగు హరిదాసమహాశయుని వచనములు. భక్తమండలియొక్క దివ్యగతిని విశ్వ మేమిగుర్తింపగలదు? ఇందువలననే జనసామాన్యము ప్రతిభక్తుని స్వప్నద్రష్టయనియు, ఉన్మత్తునియు సంబోధింపుచుండును. భక్తులు—ప్రేమగతజీవులు— స్వయంసిద్ధులు—మహానుభావులు—ఆత్మతుష్టిసంపన్నులు— నిరంతరేశ్వరారాధనా తత్పరహృదయులు ప్రపంచముయొక్క సాదూరదృష్టి కందుబాటునందు లేరు. అట్లుండుటయు నసంభవము. భక్తికళ లతినిపుణములు, అపూర్వభాసావిలసితములు! అనంతములు!!

సంగీతములకు మధురసంగీతము (The Songs of Songs) భక్తిగానమేసుడీ! భక్తిగానప్రవీణులు, కలాకుశలురును, సౌందర్యప్రియులు నవశ్యమయియే యుందురు. శ్రీచైతన్యస్వామి సౌందర్యరసపరిపూర్ణుడు. అత డద్దాని చైతన్యమందే నిరంతరము మగ్నుడయి యుండెడివాడు. ఆయనయొక్క పార్థివజీవితాంతిమదృశ్యము నీలజలనిధి యందలి యవగాహనదృశ్యమె. శ్రీకృష్ణభగవానుని మనోహరమూర్తిని స్మరింపుచు బాహ్యస్మృతిని బాసి యతడు సానందచిత్తు

డయి భవసాగరమును దరించియున్నాడు. శ్రీచైతన్యుని యంతఃకరణము రాధికాంతఃకరణసమానమె. తన హృదయేశ్వరుండగు కృష్ణభగవానుని మధురనామస్మరణమాత్రంబున నామె యొక్క కందోయి కన్నీటిబిందువులచే నిండ నవి ముత్యములవలె జెక్కిళ్ళపైనుండి జారుచుండెడివి.

పరమాత్మునియందు లీనమగుటకంటె భక్తి యింకను గాఢమయినది. తద్దేవునియందు ప్రతిబింబితమగుట కా దేవుని ప్రేమాంశమును నతనికే సమర్పించివైచుట యుక్తము. ఆ పరమాత్మ ప్రతిభావిశేషము మనహృదయఫలకముపైనంకితమగుగాక! జీవున కింతకంటె గౌరవాన్వితంబును, మహాన్వపూర్ణంబును నగు నధికార మదెద్దికలదు? సర్వేశ్వరునియం దాత్మకొదవు ననన్య ప్రేమయే భక్తి. ఈశ్వరుడు ప్రేమమయుడు. సూక్ష్మమగు ప్రగాఢ దృష్టితో గాంచిన భక్తియే సర్వేశ్వరుండని విశదముకాగలదు. భగవానుడు విశుద్ధప్రేమ రూపంబున వెలయుచున్నాడు. భక్తి భక్తహృదయముద్వారా ప్రస్ఫుటితమగు నాదేవుని ప్రేమయే. భక్తియొక్క రూపమందే భగవానుడు తన్ను వ్యక్తీకరించుకొనుచున్నాడు.

భక్తి కాంక్షకాదు. వాస్తవిక ప్రేమలాలసయును గాదు. ప్రస్తుతకాలపు టనేక నాటకములయం దీదోషమే గానవచ్చుచున్నది. "పాత్రధారులును, ప్రేక్షకులును, కామలాలసయందును ప్రేమయందును భేదమే లేదని భావించుచున్నారు. వారు

బాంబువాటర్సు శ్రీమతి టామసనును ప్రేమించుచున్నాడనియు ఆప్రేమచేతనే వాటర్సు యంధుడయి శ్రీమతి టామసనుదేవి యొక్క పతిని హత్యగావించివైచెననియు నిందుచే వాటర్సునకు దండన మొసంగుట ధర్మవిరుద్ధమనియు నుడువుచున్నారు. ఇట్టివారల నాదరించుట న్యాయవిరుద్ధము. వార్తాపత్రికలు "అతడా స్త్రీయందు ప్రేమను గల్గియున్నాడు." అని వ్రాయుచుండుట యెంతయు నింద్యము. వార్తాపత్రికల యీయుద్దేశ్యమసత్యము. భ్రాంతిమూలకము. వాడా స్త్రీని గామించియున్నాడు— వానిహృదయమందు మందునకయిన ప్రేమయే లేదు. కేవలము కామలాలసయే ప్రబలమయి యుండెను. వాడొక పాశవికవాసనాంధుడయి యుండెను. కానిచో వాడు నిర్దయుడయి యా స్త్రీపతి నేల హత మొనర్చును? సత్యమగు ప్రేమ పరిశుద్ధమయినది. అది సకలకళంకములను బాపును. పశుబుద్ధిని దూర మొనరించును భక్తిని విషయాభిలాషలనుండియు, ఇంద్రియలాలసలనుండియు, స్వార్థభావ మయస్థితిగతుల నుండియు గడుదూర మొనర్చి యాయనంతపరమాత్ముని సౌందర్యానుభవముచే దివ్యానందము ననుభవింపదగును. గీతయందు నిష్కారణముగా భక్తిని నిష్కామమని వచించియుండ లేదు. సుప్రసిద్ధుండగు ఫ్రెంచిదార్శనికుడు— ఫెనెలోను (1651 సం॥ జన్మ 1715 సం॥ మరణము.) మహాశయుని ప్రార్థనమందీ భావములు బాగుగా వ్యక్తమగుచున్నయవి:—

"ఓప్రభూ! నేను నిన్నేమి యాచింపవలయునో తెలియజాలను. ఓనాతండ్రీ! దేని నీయీబిడ్డనిచేత గోరజేతగాదో దానిని వీనికి బ్రసాదింపుము. నేను నిర్వాణమును, ఆశ్వాసమును నర్థింప సాహసింపజాలను. నేను కేవలము నీదివ్యసన్నిధి నుపస్థితుండనయి హృదయమందిరకవాటమును దెఱచివైచెదను. నాచే నెఱుంగబడనట్టి నాయవసరంబుల నో దేవా! నీ వేచూడుము! అంతయుజూచి నీయిచ్చవచ్చిన యట్లొనరించుము! నన్ను నీటముంచినను బాలముంచినను నీదియే భారము. నన్ను భక్షించినను రక్షించినను నీయిష్టమె! ప్రభూ! నీయభిప్రాయములు నాకజ్ఞాతము లయియుండియు సంపూజ్యములె. నేను మౌనవ్రతధారినేయగుదును. నన్ను నేను బలిదాన మొనరించుకొన నీదివ్యసన్నిధానమందు హాజరయి యున్నాడను. నే నాత్మసమర్పణము సేయుచున్నాడను. నీయుత్తమాజ్ఞాపాలనముకంటె నాకు వేరొండభిలాష లేదు. నన్ను నీగుణసంకీర్తనము సేయుటయందు సమర్థునిగ జేయుము. నీవే స్వయముగా నాయందావిర్భవించి నానిమిత్తము ప్రార్థనము సేయుము."

భక్తుడు కామదూరుడయి యుండును. కారణమేమన వాని కీశ్వరప్రేమజ్ఞానము కలదు. ధర్మము, కేవలము విచారశీలత్వమే కాదు. భక్తుని యొక్క జీవితము కేవలము భావనతోడనురాగముతోడను నిండియుండదు. అందు జ్ఞానముసయితముండును. ఒకవేళ వాడు జీవితము యొక్కయు, సంసారము

యొక్కయు, విజ్ఞానముయొక్కయు, నాగరకతయొక్కయు ననే
కవిషయంబుల నెఱుంగక పోవచ్చును, కాని వాడొకపరమాప
శ్యక సత్యమును బడసియున్నాడు. ఆసత్యముయొక్క పరిణా
మమే భగవానుఁడును, తత్ప్రేమయు నయియున్నది. కాని వాని
నిష్కామభావము సంపూర్ణముగా నిషేధాత్మకము కాజాలదు.
అందు నైసర్గికప్రేమకొఱకు సుస్పష్టాత్మసమర్పణశక్తి కలదు. కాన
నే భక్తుడు సంసారమును తిరస్కరించుటకును, ద్వేషించుటకును
సమ్మతింపడు. వానికి జీవితముయొక్క విషయములును, రూపము
ను — ఆ యారాధ్యాత్మనప్రేమయొక్క బాహ్యావరణముగనే
గోచరింపుచుండును. వాడు మానవసేవను దైవశుశ్రూషగనే
గ్రహింపుచుండును. "నేను సత్యమును వచింపుచున్నాడను —
మీరు దీనులకు గావించు సేవ కేవలము నాకే చెందును."
అని భగవానుడు వచించియున్నాడు భక్తుడు మానముద్రి
నవలంబించి యున్నను, హరినామస్మరణము చేయుచున్నను,
స్వీయ కర్తవ్యమునందు దత్తచిత్తుడయియున్నను, సాంఘిక
సేవాతత్పరుండయి యున్నను, న్యాయమునిమిత్త ముద్యోగ
శీలుండయి యున్నను, ప్రకృతిసందర్శన కార్యనిరతుండయి
యున్నను, నిరంతర సౌందర్యమయవాతావరణమందు విహా
రము సలుపుచున్నను వానికి సర్వదా సర్వత్ర శుద్ధస్వాతంత్ర్య
వినాదమే కర్ణగోచరమగుచుండుట రూఢి. మనజీవితమే నిరం
తరము స్వతంత్రతకొరకు జలాశయ బహిర్గత మత్స్యంబుపగిది

వ్యాకులపడుచునే యుండును. స్వాధీనత సదా సాత్వికవాతా
వరణమందే విహంగము సలుపుట యుక్తమను ధ్యానమును
ద్రోసిపుచ్చరాదు. మనచే నిక్కాలమున స్వాధీనతగా భావింప
బడు పదార్థము దుఃఖహర్తయు, నిరుపమానసౌందర్యయు
తుండును, ప్రేమరాశియు నగు శ్రీకృష్ణభగవానుని ప్రాచీ
నోపదేశంబులచే నధికపరిశుద్ధంబును, పరమప్రయోజనీయం
బును, అమితోదారంబునయి శ్రేయస్కరము కాగలదు. సన్యా
సివలె జీవితరంగమునుండి దూరముగా బలాయనమగుట భక్తి
యనబడదు. ప్రేమ, త్యాగములతోడ సమ్మిళితమయి కర్మ
యందు బ్రవృత్తమగు జీవితప్రగాఢతనుండియే భక్తి యుదయ
మగుచున్నయది.

ఇదియే ప్రేమయొక్క శాశ్వతత్వము. ప్రేమ మరణ
మును సయితము సురుచిరముగ నొనరింపు చున్నయది. భక్తి
సుధారూపమని ధర్మగ్రంథము లుద్బోధింపు చున్నవి.
అమృతముయొక్క శబ్దార్థము జరామరములేక మృత్యువిహీనత.
వాస్తవ మరయ నమృత ననంతజీవితముయొక్క బోధను
మనకు గలుగజేయుచున్నయది. ప్రేమయొక్కదిష్టి (Destiny)
సార్థకమగుటకే భౌతికవాదనిమగ్నంబగు మృత్యుప్రగాఢత
యందు జీవితముయొక్క భక్తి యావిర్భవింపుచున్నయది. జీవి
త సంసర్గమువలనను, ప్రకృతిసాక్షాత్కారంబునను, మానవ
జాతిసేవవలనను భక్తి వికసింపుచున్నయది. జీవితముతోడ

మైత్రిని సమ్మిళిత మొనరించుకొనునట్టి వానికి మనుష్యులును, ప్రకృతియు బరమాద్భుత సుఖప్రదంబులగు పదార్థములే యగును! భక్తుడే తత్త్వము యొక్క వాస్తవిక రహస్యమును గ్రహించుచున్నాడు. వాడు దృష్టిగోచరంబగు సమస్త జగత్తును సౌందర్యముతోడను, వైచిత్ర్యముతోడను బరివేష్టితమయి యుండుట నవలోకింపుచున్నాడు. ఆతడు కేవలము మూర్తీభవించిన ప్రగాఢ ప్రేమయె.

వాని కేవిధమయినట్టియు నైహికము లేక ప్రపంచము లేదు. వాడు భౌతికము నాధ్యాత్మికము యొక్క ఛాయా మాత్రమనియే తలపోయుచుండును. స్త్రీ, పురుష, బాల, బాలికల ముఖంబుల వానికి బరమాత్మ యొక్క వైలక్షణ్యమే గోచరింపుచుండును. మాయను లీలయందు బరిణత మొనర్చు ప్రేమసందేశమునే విజ్ఞానము, నాగరకత, నగరవ్యవసాయములు మొదలగునవి నిత్యము వినిపించుచుంధును. అట్టి భక్తుడు ప్రకృతి నాత్మ యొక్క సంసరణముగ నెంచుచుండును. "ఒక పర్వత దేశీయ మనుష్యునకు బుష్పములయం దపరిమితమగు ప్రేమయుండెను. ఆతడు తనపుష్పవాటికయం దెన్నియో పూలమొక్కల నాటియుంచెను. ఒకదివస మతడు వ్యాధిపీడితుండయ్యెను. శయ్యాతలమునుండి లేచుశక్తి కూడ వానియందు లేకపోయెను. అందువలన నతడు పూలమొక్కలకు నీరుపోయుటాదిగాగల సేవను జేయజాలకపోయెను. కాని యతడు ప్రతి

దినము పేర్మిమౌదాసీన్యములచే బూర్ణమయిన దృష్టితో నావు ప్పముల వైపునకు వాతాయనపథమునుండి విలోకింపుచుండెడి వాడు. ఒకవాసర మతడు గవాక్షస్థలంబున నుపవిష్టుడయి యుండ నల్పవయస్కులగు బాలురు వివిధవర్ణవిరాజితంబులగు వసనములధరించి యాపుష్పోద్యానమున నాకుసుమముల సన్నివేశమున గానము సేయ దొడంగిరి. బాలుర యామనోహరంబును, సుందరంబును నగుగాన మాశైలవాసు నాహ్లాదితచిత్తు నొనర్చెను. అతడంత గడు నాతురతతో వారలనిట్లు పృచ్ఛించెను:—"మీరెవ్వరు?" వారిట్లు ప్రత్యుత్తరము నొసంగిరి:—"మేము పుష్పవాసులమగు దేవతలము, మేము స్వీయసంగీతముచే మీవ్యాధి నుపశమింప జేయ నేతెంచియున్నారము" ఆపర్వతవాసుని యంతఃకరణమందు భక్తియుండెను. గీతములన్నను, సౌందర్యమన్నను వానికపరిమితప్రీతి. వాని నేత్రము లాకుసుమవాసులగు దేవతల సందర్శింప సమర్థము లయ్యెను. వాని వ్యాధి నిర్మూలమయ్యెను." ఈకథ దృష్టాంతరూపము లేక నిదర్శనమాత్రము.



సమాప్తము.

మఠము ధర్మమును బహిష్కరించి వేయుదమా? మన దేశభ్రాతలయం దనేకులు ధర్మమును, నిర్బలత్వమును—

దుఃఖమును నాపాదించు దానిగ భావించి, దానిని జీవితకార్యములనుండి నిర్వాసితమొనర్ప నభిలషించు చున్నారు వారు రాష్ట్రీయ స్వాతంత్ర్యము నిమిత్తము ధర్మమును సయితము బలిదాన మొనర్పవలసి యుండునని గంభీరముగా వచింపుచుందురు. కాని నేను "ధార్మికజీవితమే సబలరాష్ట్రముల యొక్క సర్వప్రధాన యోజనం" బను నితిహాసలేఖకుని సదభిప్రాయముతో బూర్ణముగా నేకీభవింపుచున్నాడను. ఈపరమప్రధానంబగు ప్రయోజనము భరతఖండమున నష్టభ్రష్టమగు చున్నయది. నేను ధర్మమునే జీవితము యొక్క తథ్యముగ విశ్వసింపుచున్నాడను. ధర్మమందే సకలాదర్శసమన్వయము కలదనియే మామకాభిప్రాయము. రాష్ట్రీయ జీవితము యొక్క మూలము, మానవ నిర్మితములగు కృత్రిమధర్మ సిద్ధాంతములు కాజాలవు. శ్రద్ధ, ఆశ, మానవజాతియందు ప్రేమ, మానవారాధ్యాదర్శము మొదలగు నైసర్గికవిశ్వప్రేమమయసిద్ధాంతములే ప్రధానమూలము కాగలదు. ధర్మమే మన కాత్మనిష్ఠను, స్వావలంబనమును బోధింపుచున్నయది; కారణమేమన మనకు ధర్మముపలననే యంతఃకరణంబున విద్యమాన మయియున్న యాత్మ యొక్కయు, మనుజుని దివ్యదృష్టి యొక్కయు బరిచయము లభింపు చున్నయది.

అధునాతన కాలమునం దనేకభారతీయయువకు లాత్మ యొక్కయు, నాధ్యాత్మిక సామ్రాజ్యము యొక్కయు నస్తి

త్వము (ఉనికి) నే విశ్వసించుట లేదు. యువజన బృందము ప్రసిద్ధదార్శనికవిద్వాంసుడగు మేయరువచించిన సకలధర్మముల భూమిక యొక్క సత్యమును విశ్వసించుటయం దనేకసందేహముల జూపుచున్నయది. భారతవర్షమునం దీసశంకాభావోదయ మనేక కారణముల యొక్క పరిణామమయియున్నది. అధునాతన భారతము పాశ్చాత్యుల శిల్పవాణిజ్య రాజనీతి విషయకంబులగు నాక్రమణములవలననేగాక మానసికబుద్ధి సంబంధీయములగు నాక్రమణములవలనను ముట్టడింపబడి యున్నది. హిందూపురాణ గ్రంథోక్తమగు కలియుగమును స్మృతిపథమునకు దెచ్చునట్టి యుగమున బశ్చిమదేశీయులు ప్రవేశించియున్నారు. ఈయుగము మానవుని యొక్క యాధ్యాత్మిక దృష్టిని, జ్ఞానచక్షుపులను గప్పి వైచుచున్నయది. గతించిన యైరోపాఖండ మహాసమరము తద్దేశము యొక్క కన్నుల నిప్పుడుసయితము విప్పగలదను సంపూర్ణవిశ్వాసము నాకు గలదు. కారణము—రక్తమును, ప్రచండానల జ్వాలయును జ్ఞానోత్పాదక సాధనములని శాస్త్రములు ఘోషించుచున్నవి. ఓభగవానుడా! నవీనబుద్ధి యొక్కయు, నవ్యభావన యొక్కయు, నూతనయుగము యొక్కయు సుదినమును శీఘ్రము దర్శింపజేయవా? ప్రస్తుతకాలమున బశ్చిమదేశంబుల సర్వోత్కృష్ట జ్ఞానము భౌతికవాదమె. జర్మనీదేశము యొక్క బుద్ధి "ఈశ్వరు డాత్మహత్యగావించికొనినాడు, ఇప్పు

డవాన్ని ధ్వంసావశేషము మనరూపమందు సకలవిశ్వమున వ్యాప్తమగుచున్నయది," యను వినాశకరంబగు యుక్తి నన్వే షించినది. జగద్విఖ్యాతుండును, ఫ్రెంచిదేశీయ విద్వాంసు డును, అసంఖ్యాక దేశవిదేశీయ జనులకు నాదర్శగురు సత్త ముండును నగు ననాతోలే ఫ్రాన్సు (Anatole France) యిట్లు నుడివియున్నాడు:—"నేను పరమాత్ముని విషయము కథోపకథనమును, సర్వేశ్వరు డనువాడు వాస్తవముగా నున్న చో వాడధికముగా నధికనిందనీయుండును, ఘృణార్హుండు నగు వ్యక్తియను సిద్ధాంతమును సమర్థించునిమిత్తము వ్రాయనభిల షించుచున్నాడను. ఎందువలననన నతడీఘుహాసమరము నేల ఘటియింపజేసియున్నాడు?" సర్ ఆర్థరు కోనన్ డాయిలు దుఃఖ ముతోడ సత్యమునే వాక్రుచ్చియున్నాడు:—"ప్రతిదేశ మందును వర్తమాన విచారపద్ధతి, ఆధ్యాత్మిక భావనవంతని సంపూర్ణముగా నశింపజేసి వేయుచున్నయది." పాశ్చాత్యాధుని కాధ్యాత్మికవిద్య జీవితాంతరిక సంపుష్టీకరణ ప్రేరితము కాదు. క్రైస్తవ ప్రార్థనాలయము అనేకులకు సంతోషమును బ్రసా దింపజాలక యున్నది. బాహ్యరూప మపరోక్షంబును, ఆధ్యా త్మికంబును నగు దివ్యశక్తిని విధ్వంసమొనర్చి వేసినది. భరత ఖండముయొక్క యువకులనేకులు పాశ్చాత్యజ్ఞాన విజ్ఞాన విధానమునకు దాసులయి ధర్మమును మర్త్యంబుగను, నశ్వ రంబుగను భావింపగడంగు చుండుటెంతయు లజ్జాకరము!

ధర్మము కలహములనుండియు, ద్రోహ వైమనస్యముల నుండియు భిన్నముగనుండు పదార్థము. సాంప్రదాయకత్వమెపుడును ధర్మముకాజాలదు. మనల నిర్బలులుగ జేయునది యధర్మమే. ధర్మమందు సంయోగము లేక యేకీకరణము వెలయుచుండును. ధర్మము మానవు నాత్మతోడి బాంధవ్యసూత్రంబున బంధించివైచి, వానిజీవితమునకు నవీనశక్తిగౌరవంబుల బ్రసాదింపుచుండును. ధార్మికప్రవృత్తియొక్కయు, భావముయొక్కయు క్షయము (నాశము) వలన రాష్ట్రములు పతనంబునకు బాల్పడును. "ధర్మమే పరమశక్తి" యను రహస్యమే దీనికి బ్రబలహేతువు. ధర్మముకంటె నీసృష్టియందు సారమేది కలదు?

—టి. ఎల్. వాస్వాని.

